శ్రీరస్తు.

# శ్రీ శ్యమంతకోపాఖ్యానము.

మంగు - వేంకటలక్ష్మీనృసింహారావుచే

రచియింపఁబడి

ప్రకటింపంబడియె.

మొదటికూర్పు. 1000.


చెన్నపురి

కలారత్నాకరముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1899 వ సం॥




వెల అణాలు 3.

శ్రీరస్తు.

# శ్రీ శ్యమంతకోపాఖ్యానము.

మంగు - వేంకటలక్ష్మీనృసింహారావుచే

రచియింపఁబడి

ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు. 1000.

చెన్నపురి

కలారత్నాకరముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1899 వ సం॥



వెల అణాలు 3.

# ఉపోద్ఘాతము

ఈకథ శ్రీభాగవతమందును శ్రీవిష్ణుపురాణమం దును గించిద్భేదముగా నున్నది కాని గజాసురవృత్తాంత మీరెంటియందును లేదు. కొందఱు శ్రీభాగవతములోని యీభాగమును విని వినాయకచతుర్థినాఁడు చంద్రునికిఁ గలిగిన శాపమునకుఁ గారణము తెలియక మఱికొందఱు చెప్పిన (గజాసురుని తపస్సునకుమెచ్చి శివుఁడు వరములిచ్చి వానిలోనుండుట, పిదప బ్రహ్మవిష్ణువు మొదలైనవారు గంగిరెద్దువేషములు వేసికొనిపోయి గజాసురునిఁజూచుట మొదలగు సంగతులుగల) కథను విని తుదకుఁ బూర్తిచేసికొనుచున్నారు. అట్టికథనువిని వలయు సంగతులు శ్రీవిష్ణుపురాణ శ్రీభాగవతములనుండి గ్రహించి యీగ్రంథము చేసితిని, గాని తగిన యాధార మేదియు దొరకలేదు. శ్రీవిష్ణుపురాణమునకు శ్రీవిష్ణుచిత్తాచార్యులవారు చేసిన వ్యాఖ్యానమందు బ్రహ్మపురాణములోని యీ కథకు సంబంధించిన శ్లోకము లుదాహరించుటచేత బ్రహ్మపురాణోక్తక్రమంబుగాఁ జేసితినని ప్రబంధారంభ

మందు వ్రాసినాను. శ్రీ బమ్మెర పోతరాజుగారు చేసిన యాంధ్రభాగవతములోని శమంతకమణికథకు సంబంధించిన పద్యము లీగ్రంథమం దుత్తరభాగములోఁ గొన్నిచోట్లఁ జేర్చినాఁడ. ఆయంశములకు నేనుజేయుపద్యము లంత రసవంతమై యుండవుగావున నేచేర్చితి. నాకేమియుఁ బాండిత్యము లేదు. చేతనయినట్టు కృతిచేసిన నాసాహసంబునకు క్షమించి వ్యత్యస్తమైన యంశములు దెలిపి దిద్దించెదరని సుజనులఁ బ్రార్థించెద.

విళంబినామసం॥ పుష్యశుద్ధ ౧౨॥

మంగు-వేంకటలక్ష్మీనృసింహారావు,
పాలమూరు, గోదావరిజిల్లా.

# విషయసూచిక

విషయము. పుట.

## — పూర్వభాగము. —

విషయము.

## — ఉత్తరభాగము. —

శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ శ్యమంతకోపాఖ్యానము.



శా॥ శ్రీలీలావతిఁ గూడి పాల్కడలిలో శేషాహిపై నుండి నా।
నాలోకంబుల నేలు బ్రహ్మమను నానారాయణుం డెప్డున।
న్నాలోకించు దయార్ద్రదృష్టిఁ గృతి నత్యంతానురాగంబుతోఁ।
బాలించు న్భువనైకభవ్యమగుచు న్వర్ధిల్లగా నిద్ధరన్॥ ౧॥

కం॥ నలువను వాణిని శివును మఁ।
బులోమజాధీశముఖ్యబుధవరులను నేఁ।
దలఁచెద ననయము నీకృతి।
యిలలో వెలయంగఁ జేసియే లెడికొఱకై॥ ౨॥

మ॥ సరసీజాప్తుఁడు లోకమిత్రుఁడు త్రయీసారంబు కాలాత్మ భా।
స్వరమూర్తిత్రయ ముఖ్యరూపము జగచ్చక్షుస్సుదీనార్తసం।
భరణక్షిప్రదయాప్రసన్నుఁడు ఘనప్రత్యక్షదైవంబు భా । స్క
రుఁ డెల్లప్పుడు బ్రోచుఁ గావుత మమున్ సర్వార్థసంధాయియై॥ ౩॥

సీ॥ వ్యాసవాల్మీక్యాదిప్రథమకవీంద్రుల
భవభూతిమొదలుతర్వాతికవుల।
శబ్దానుశాసనశంభుకవ్యాద్యాంధ్ర
కృతికర్తలను గొల్చి కేవలంబు।
నారాయణునిఁ బోలు నారాయణాచార్యు
నస్మదాచార్యుని నాత్మ నిల్పి।

చినమేనమామను జింతలపూడివం
    శ్యఘను గోపాలరాయునిఁ బవిత్ర।
కౌశికసగోత్రు విశ్రుతగజదనుజత।
పోవిశేషాదివృత్తాంతపూర్ణకథకుఁ।
దలఁచి తెలుఁగున గద్యపద్యములఁ జేసె।
దనుశ్యమంతకోపాఖ్యానము నెడుదీని॥ ౪॥

మ॥ హరికళ్యాణగుణార్ణవుండతనివిద్యాప్రౌఢివర్ణించి పూ।
ర్వబుధుల్వ్యాసశుకాదికుల్వెలసిరార్యస్తోత్రపాత్రంబులై।
యరయన్నరకచేయుదుంగుకవిహాస్యాత్యర్థపాత్రంబనై।
సరసుల్మెత్తురుగాకయీకృతినివిశ్వాసాదరాయత్తులై॥ ౫॥

కం॥ చేదువులు నేరనిమూఢులు।
గోదుకుచుఁ గృతి నేయ శుభునకుఁ గోఱఁ
సదములజలములు శునకము।
గదికినఁ జెడు నేకడఁ గెదఁ గబ్బముగారి ౬॥

కం॥ పుట్టుమకల్పన నెగడదు।
పుట్టిన నెగడుఁ దలఁ పొకఁడుఁ పోకడయొ
గట్టిగవశిప్రాసంబులఁ।
బుట్టునుదడవికొనుటకృతిపూర్ణంబగు। ౭॥

## షష్ఠ్యంతములు

ఉ॥ హరికిద్వారకాపురవిహారికిగోపనితంబినీమనో
హారికివైరిసంపదపహారికిదారుణదైత్యవర్గసం।
హారికిభూసురేంద్రదలలనార్పితపక్వపదార్థసత్ఫలా।
హారికిశౌరికిన్నుతసమాశ్రితభక్తవిపత్ప్రహారికిన్॥ ౮॥

కం॥ పావనునకు విహారితబ్బం।
దావనునకుని జకటాక్షతతికృతసురబృం।

దానవునకుఁ ద్రిజగత్సం
జీవనునకు వాసుదేవ సేవ్యపదునకున్ ॥ ౯ ॥

చం॥ సురహయవాహినీ సురభిసోమసితాభ్రపటీరకీర్తికిన్
సురుచిరసౌకుమార్యనవసుందరతాకమనీయమూర్తికిన్ ।
బరమతపస్సమాధిరతపావనమానిమనఃప్రవర్తికిన్ ।
హరవిధివాసవాదినిఖిలామరజాలకచక్రవర్తికిన్ ॥ ౧౦ ॥

కం॥ భోజతనూజాహృదయాం ।
భోజభ్రమరమునకు భయపూరితమతికాం ।
భోజపదత్తహయునకున ।
భోజలమాయానిలాగ్నిభూహేతునకున్ ॥ ౧౧ ॥

కం॥ తరుణునకును శేషకృతా ।
స్తరణునకతిపాపతిమిరతరణికిభవసం ।
తరణికిమదారిభయదకృ ।
తరణికిశ్రావ్యమురళీకృతవినుతరణికిన్ ॥ ౧౨ ॥

వ॥ అనియిష్టదేవతా ప్రణామంబును విశిష్టగురు జనసన్నుతియుఁ
గావించి బ్రహ్మపురాణోక్త క్రమంబుగా నే నొనర్పంబూని
న శ్యమంతకోపాఖ్యానంబునకుం గథాక్రమం బెట్టిదనిన ॥ ౧౩ ॥

## ౧. కథాప్రారంభము.

మ॥ అతిపుణ్యంబగు నైమిశంబునను దివ్యజ్ఞానులౌ శౌనకా ।
దితపస్విప్రవరుల్పురాణములభక్తిశ్రద్ధలన్వించుచున ।
స్మృతినిట్లాడిరి రోమహర్షణిఁగలామాన్యున్ సమస్తాగమో ।
దితధర్మజ్ఞుని సూక్ష్మధీయుతుని వర్షిష్ఠప్రభాభానునిన్ ॥ ౧౪ ॥

కం॥ అజుఁడగు విష్ణువు కృష్ణుఁడు ।
యిజనించెధరిత్రి నేలయేపనులానరిం ।

చెఁజె వృమతచ్ఛుభచరితము।
వృజినమువీనులకు విందు విందము సూతా॥ ౧౭॥

మ॥ సకలారాధ్యుఁడు పూర్ణకాముఁడగు శ్రీసాహోయ్యుఁడేలాశ్య
మంతకరత్నంబుహరించినాఁడనెడునిందంబొందెలేవాక్రావా
నికిఁజింతామణికౌస్తుభంబు మఱి మాణిక్యాలయంబీశము। తక
మెట్లబ్బెనుదూఱువోయెనెటు సూతాచెప్ప వేయంతయున్॥

వ॥ అనినవిని సూతుండు శ్రియఃపతిందలంచి గురుని సంస్మరించి
యమ్మునిపుంగవులతో నిట్లని చెప్పందొడంగె॥ ౧౮॥

చం॥ అజుఁడునునిర్వికారుఁడగునచ్యుతుఁడెల్ల జగంబులీలతో।
సృజనమొనర్చిప్రోచుచునుశిష్టులరక్షనొనర్పదుష్టులం।
గుజనులఁజెంపధర్మమిలఁగూర్పఁగఁగోరియవ్వడప్పధా।
త్రిఁజననమెత్తుచునుండుఁదగురీతులతోడఁజతుర్యుగంబులన్॥

కం॥ భూభారముమాన్పటకై।
భూభవకమలాసనముఖభుక్ప్రార్థితుఁడై।
శ్రీభర్తయెకృష్ణాకృతి।
వైభువిలోవాసుదేవుఁడననుదయించెన్॥ ౧౯॥

వ॥ ఇట్లు జనించి క్రమక్రమంబున శుక్లపక్షపాకరుండుంబోలెనభి
వృద్ధింబొంది సమస్తవిద్యలునేర్చి సముద్రంబున ద్వారకాపు
రంబు నిర్మించి వైదర్భియగు రుక్మిణింబెండ్లాడి చెలంగుచుండ
నొక్కనాఁడు॥

మ॥ తరణింగొల్చిశమంతకంబుఁగొనిసత్రాజిత్తుకంఠంబునన్।
హరువొప్పంధరియించివచ్చుడునుమణ్యర్చిర్నిరుద్ధాక్షులై।
హరితోఁబౌరులుదేవచూడుమదిగోయాదిత్యులం డెవ్వఁడో।
ధరకుద్యోతితమూర్తివచ్చెననమందస్మేరుఁడైయిట్లనెన్॥ ౨౧।

## ౨. శ్యమంతకరత్నప్రభావము.

కం॥ సత్రాజిత్తుండీతఁడు।
గాత్రమునఁగలదుశ్యమంతకంబనుమణిత।
చ్చిత్రచరిత్రమువినుఁడీ।
మిత్రుఁడువీనికిదిభక్తిమెయిదయచేసెన్॥ ౨౨॥

వ॥ మఱియు నిమ్మహారత్నంబు పరిశుద్ధగృహంబునం బెట్టంబడి శుచులగువారిచేఁ బ్రతిదినంబు శ్రద్ధాభక్తియుతంబుగఁ బూజింపఁబడుచుండెనేని యెనిమిదిబారువల సువర్ణంబుగురియించు, నింతియెగాక యారాజ్యంబున రోగవ్యాళానలతోయ దుర్భిక్షానావృష్టిమారికాద్యుపద్రవంబులు రాకుండఁజూచు, దురాచారుండు పూజించిన ధరించినఁ దత్క్షణంబ యారాష్ట్రంబు క్షీణంబుగావించి వానినం బురుహూతపుత్ర పురంబున కతిథిఁగాఁ బంపుననుచుం జెప్పి పుచ్చి యొక్కనాఁడు సత్రాజిత్తుం జూచి॥ ౨౩॥

గీ॥ కృష్ణుఁడుగ్రసేనుకొఱకుఁగేరుచేడిగా।
మణినిధిధనలోభియైననెఘనునిఁగనక।
యాత్మవత్సర్వభూతానియనుసదుక్తి।
నైనఁదలఁపరాదొకృష్ణుఁడాత్మనంచు॥ ౨౪॥

వ॥ మఱియును సత్రాజిత్తు॥ ౨౫॥

కం॥ హరిహరియించుటని జమని।
నిరులీనుశమంతకముఁబ్రసేనునకిచ్చెన్।
హరిహరిదుష్టుండనిచే।
నిరిపొరులునిందవీఁడుశ్రీకర్ష్ణుండే॥ ౨౬॥

వ॥ అంతఁ బ్రసేనుండు॥ ౨౭॥

ఉ॥ ఆతఁడొకవేటకై చనెను దా శమంతకరత్నమూని శో
భాతతమూర్తియై బలము పాయక కొల్వఁగ నుత్తమాశ్వము
న్స్ఫీతచిరత్నరత్నతపనీయ విభూషణయుక్తమెక్కి యు
ద్ధూతపతాకినీపవన తోయదమండలుఁడై ప్రమోదియై॥ ౨౯॥

వ॥ ఇట్లు వనమ్మునకుం జేని మృగంబులం బొడుచుచు సింహంబులం దోలుచు వరాహంబుల నేయుచు నేనుంగులఁ బీనుంగులఁ గావించుచు నేయుఁడేయుండు పొడుఁడుపొడుండనుచు భటుల కుత్సాహంబు గొల్పుచు నేన నేన పొడిచితిననువారి మెచ్చుచు బహుమతులిచ్చుచుఁ గొందఱువరుసఁ బెరల రేఁపుచుఁ దేనియలఁ ద్రావుచు మద్యంబులఁ గ్రోలుచు నొకరొకరిపై వ్రాలుచుఁ దడఁబడ నడచుచు వెక్కసమ్మయిన సోలుచుఁ బ్రల్లదమ్ములఁ బ్రేలుచు నొడళ్లు మఱచి పిలిచినఁ బలుకక పలికిన దెఱుఁగక కొందఱు కొంతవడికిఁ దెలిసికొని లెండు లెండురండు గండంబులఁ బొడుండనుచు వేఁటాడుచుండ॥

కం॥ అంభోజభవాండముఁ బ్రా
రంభస్థితి నుంపనఁగఁ గ్రమ్ముచునచ్చో
గంభీరాంభోధరములు
కుంభంబులవలనఁ బోలెఁ గురిసెన్వానల్॥ ౩౦॥

గీ॥ సేన పురికేగఁగానఁ బ్రసేను నొకని
విడిచి వానినశ్వమ్ముతోఁ బెద్దనిదురఁ
బొందఁజేసి శమంతకమంద మొంద
నఱుతఁ దాలిచియేగె హర్యక్షమొకఁడు॥ ౩౧॥

గీ॥ సరగ దానిఁ జూచి జాంబవంతుఁడు చంపి
రత్నరాజముగొని రంజిలంగఁ

బాలుతోట్లలోనఁ గేళికందుకముగఁ
గట్టెఁబట్టుపట్టియెట్టిజెట్టి॥ 3౨॥

వ॥ అట సత్రాజిత్తుండు నొండొంటిహత్తకవచ్చిన మొత్తంబులం గాంచి తమ్మునింగానక యుత్తలంబొంది చిత్తంబునఁ బలువిధంబులఁ దలపోసి॥ 33॥

కం॥ కృపణుఁడుకృష్ణుండోర్వక
ప్రపుణ్యునిఁబ్రసేనుఁజంపి భాసురరత్నం
బపుడేచేకొనెననెనీ
యపవాదమ్ము వినియదువరాగ్రణియాత్తుల్॥ 3౪॥

వ॥ సత్వరంబునంబోయి హరితోనీవార్త విన్నవించిన నన్నన్న నేనెద్దానినెఱుంగ నాకట్టిఁడినీచుండిట్టి అట్టులాడి చెట్టల కొడి గట్టసమకట్టియుండె, నైనవానిననందగదు. నాచేసినపూర్వకర్మఫలంబిట్టిద. ఎవ్వండేని తనసుకృతదుష్కృతఫలంబనుభవింపకతప్పునె. మఱియు॥ 3౫॥

కం॥ పాలంబిదుకుచుఁదత్పా
త్రాలోలక్షీరములసుధాంశుప్రతిబిం
బాలోకనమేఁజేసితి
మూలంబదియీాసడికనెమురహరుఁడరయన్॥ 3౬॥

వ॥ నావినియత్యావిలహృదయులై సంయమీంద్రులు భయవిస్మయంబులు పెనంగొననిట్లనిరి॥

సీ॥ అత్రితపఃఫలంబనసూయనోమిన
నోములపంటసన్నుతయశుండు
దైవతవరగురుదత్తవిద్యావేత్త
పావనబ్రహ్మాంశభాసురుండు

తుంగాతరంగిణీసంగతాశ్రమకృత
సతతతపస్తుష్టజలజభవుఁడు।
కువలయామోదవైభవుఁడు సర్వజ్ఞశి
రోమణిధాతృదత్తామృతత్వ।
సద్విలాసినిశాపతిసద్ద్విజౌఘ।
ధీశుఁడమృతాబ్ధిసమ్మోదియిందుఁడతఁడె।
యిందిరాసోదరుఁడు కౌముదీశుఁడైన।
చంద్రుఁజూచిన నఘమేల సంభవించు॥ ౩౮॥

ఉ॥ భానునిఁ జిత్రభానుహిమభానున్నృపాలునిజాహ్నవీనదిన్।
సూనృతవాదియైనద్విజు శ్రోత్రియుఁజూచిన సర్వపాపము।
ల్వేనశియించునంచెఖిలవేదవిదుల్వచియింతురట్టిచో।
నీనళినాలయాసహజుఁడేటికినింద్యుఁడు రోమహర్షణీ॥ ౩౯॥

వ॥ అనిన సూతుండిట్లనియెఁ జంద్రుండట్టివాఁడ. అయిననయ్యాచలాత్మజచే మున్నొకశాపంబుకలిగె. కావునఁ జూడ ననర్హుఁడయ్యె. అక్కథ వినుపించెద నేకాగ్రచిత్తులరై వినుండు ॥౪౦॥

## 3. గజాసురవృత్తాంతము.

శా॥ కైలాసోత్తరపుణ్యభూమిగజుఁడన్ క్రవ్యాదుఁడొక్కండు శ్రీ।
కాళీనాథునిఁగూర్చి ఘోరతపముంగావించెఁ బెక్కేఁడులా।
భీలస్థైర్యసుశాంతిదాంతియుతుఁడై వృష్టుష్ణశైత్యాదులే।
మాలోచింపక దేవతల్వెఱవఁద్యక్తాహారుఁడై ధీరుఁడై॥ ౪౧॥

కం॥ రీతిఁదపము సేయఁగ।
భయవులై యమరులెల్ల వెడలిగిరిశునా।
ర్యారతుఁగనిన తులైకై।
వారంబులు సేసిరి బహువారము భక్తిన్॥ ౪౨॥

ఉ॥ దేవమహానుభావ బహు దివ్యము హూపనిషత్ప్రణీతగా।
ధావిజయాంకదీనజనతా ఘనదైన్యవినాశయీశనీ।
వీవిపదబ్ధితారమణ హీనగతింబొనరించుసర్వవే।
ద్యావినుమాగజాసురుఁడు తావకదర్శననిత్యకాంక్షతోన్॥

కం॥ ఘోరముగుతపము నేసెడి।
దారుణమైతత్తపోగ్నిత్రైలోక్యంబున్।
వారక కాల్చెడివానికిఁ।
గోరినవరమిచ్చి గాచికొనుమా జగముల్॥ ౪౪॥

కం॥ నావినినినమితనిజనా।
నావినియామాచరణసనాధులసురలం।
బ్రావృడ్గంభీరాంభో।
దావిర్భూతధ్వనినిటులనియెందయతోన్॥ ౪౫॥

చం॥ గజుఁడుమదీయకింకరశిఖామణి మెచ్చితిఁదన్మహత్తపం।
బుఁజేనితదీప్సితంబొసఁగి ప్రోచెదఁగాక జగంబులీరలె।
ల్లఁజేసుఁడుమీపురంబులకులగ్గుననన్నను మ్రొక్కి నిర్జరుల్।
గజిబిజిలేకయేగిరతికౌతుకభావముతోడనంతటన్॥ ౪౬।

మ॥ వృషభారోహకుఁడై త్రిశూలధరుఁడై భృగ్వాదిసంసేవ్యుఁడై।
విషభృద్భూషణుఁడై యుమాసహితుఁడై విశ్వార్తిసంఛేదియై।
విషముండైన గజాసురోత్తమతపఃప్రీతాత్ముఁడై సద్వపు।
స్సుషమాశోభితదిగ్విభాగుఁడగుచున్ సోముండు వేగంబునన్॥ ౪౭

వ॥ చేని వానింగని యిట్లనియె॥

ఉ॥ దానవసార్వభౌమ సురదర్పవిఖండన యోగజాభిధా।
నానినుమెచ్చితింగడుమనంబునఁగోరికియేమి వేడు మే।
వేనివరంబులింకఁదప మేటికి డస్సితిచాలలోకమం!
దీనియమంబుతోఁదబము నెవ్వఁడు నేయును లెమ్ము నావుడున్॥

కం॥ ఘననిధిఁగను పేదకరణిఁ।
ద్రిణయనుఁజూచిగజముఖుఁడుప్రియసంభ్రమము।
లెప్పనగొననిట్లనియెఁబ్రణతి।
యొనర్చియతిభక్తివేదసూక్తులతోడఁ॥ ౫౦॥

సీ॥ సర్వేశ సర్వాత్మ సర్వజ్ఞ సర్వాధ్య
యజ్ఞేశయజ్ఞచంద్రావతంస।
గౌరీమనోహరాగంగాతరంగిణీ
ప్రాకటనటితజటాకలాప।
చిద్రూపబహురూపవిద్రావితారాతి
వీరాతిధీరాకవిప్రగీత।
దాససంత్రాసనిరాసకాభాసుర
దేవతాకుసుమసందీపితాంగ।
యంగజమదమత్సరాహంక్రియాంభోజ।
గజయగజముఖాబ్జకములమిత్ర।
మిత్రవహ్నిచంద్రనేత్రయానేత్రయా।
వేదులకయిననిను వెదకి తెలియ॥ ౫౧॥

కం॥ పరమేష్ఠికైనఁదెలియని।
పరమాత్మునీవెవచ్చి ప్రత్యక్షముగా।
వరమిచ్చెదననుగుమనెద।
వరయంగానింతకంటెనర్థ్యముగలదే॥ ౫౨॥

## ౪. శివుఁడు గజునికి వరంబులిచ్చుట.

వ॥ అయిన నీవమోఘదర్శనుండవు నాకడంకయు నట్టిద కావున॥

గీ॥ సర్వలోకదిక్పాలకజయసమర్థ।
బాహుబలమునుభోగసంపదలనిమ్ము।

మఱియు నాయెద నెప్పుడు మరలకుండు।
మయ్యయంతకు మూలంబవై ననీవు॥ ౫౪॥

కం॥ నీమూలంబునఁ గాకొరు।
చేమృతివడయంగ నోప శివయివియుమ్మా।
నామృడుఁడని యెకాధర్మము।
నేమఱకుము తేజమునీరు లెప్పుడుఁగలుగున్॥ ౫౫॥

కం॥ నీచిత్తములోనుండెద।
నీచెప్పిన వరములిడితి నీచమతిందు।
ష్టాచరణముఁ జేసిన నో।
రీచేటుని జంబునీకు మృడు మూలమునన్॥ ౫౬॥

వ॥ అని వరంబులొసఁగి నిజసతీయుతంబుగం బరివారంబుఁ గైలా
సంబున కనిచి సూక్ష్మస్వరూపియై వాని హృత్కమలకర్ణికా
పీఠిక నధివసించె; అంత గజాసురుండ ప్రతిహతప్రభావ శైవ
తేజోవిరాజమాన దేహుండై దానవ విశ్వకర్మం దలంచె. వాఁ
డును వచ్చి నమస్కరించి సురారాతి తేజంబున కద్భుతంపడి
స్వామీ నావలని ప్రయోజనంబేమి యన గజుండు నీవిచ్చోట
నన్నాకమున కన్నమిన్నలగు వన్నెలఁ జెన్నలరు పురంబొ
క్కటి నిర్మింపుమనుఁడు వాఁడును దత్క్షణంబ నిజకలా కౌ
శలంబేర్పడ నిర్మించె నప్పట్టణంబు. ౫౭॥

చం॥ పరిఖలతో సువర్ణమణిభాసిత గేహవిహార కేళికా।
సరసులతోఁ దురంగగజసద్భటతుంగశతాంగయుక్తమై।
సరసిరుహేక్షణానికర సంయుతమై త్రిదివంబు డంబుల।
న్నిరసనమాడుచుండెడిని నిత్యరమానిలయంబొకోయనన్॥ ౫౮॥

ఉ॥ అంత గజాసురుండు ముదమందుచు వాని బహూకరించి సు।
స్వాంతత నాప్తులైన దనుజాఢ్యులుఁ గొల్వఁగఁ గావ్యభాషితా।

నంతశుభోదయంబుననిశాంతముఁ జేరిమణీయయాసనం।
బెంతయు వేడ్క నెక్కెఁదనునీశ్వరుఁడంచును రారులాడఁగన్॥

కం॥ క్రమమునఁ బుణ్యజనావళు।
లమృతశరీరములతోడ నాతని పురికిం।
బ్రమదమునఁ బోయి నిల్చిరి।
యమరులవీడేలయింతయందమె యనుచున్॥ ౬౦॥

వ॥ పదపడి రాకాసిమూఁకలస్తోకంబులై సేవింప గజాసురుండుత్రి
లోకవిజగీషువై ప్రస్థానభేరి వ్రేయించి సైన్యంబుతోఁ గదలి॥

సీ॥ తురగఖురోద్ధూతధూళీసమూహంబు
కరిదానవారిలోఁ గలిసి మునుఁగ।
స్యందననీరంధ్రసంతమసం బెల్ల
భటహేతిదీధితి పాయఁ జేయ।
బృంహితహ్రేషితభేరీకృతోద్భట
సద్భటార్భటు లెల్ల సంకులముగ।
జైత్రయాత్రను జేసి శత్రువిభేదియై
రాజుల జేజేలఁ బ్రబలురైన।
బలినివాసవాసుల నోర్చి వారి వారి।
కర్హమైన యాడిగములనందునంద।
మర్చి యమితవైభవముతో మరలెనాత్మ।
పురికి నమ్మహోగ్రప్రతాపుఁడగు గజుఁడు॥ ౬౧॥

వ॥ ఇట్లువచ్చి సమస్త సంపత్సమృద్ధిమంతుండై కేసరియను కర్బ్బుర
వర్యుకూఁతుఁ గల్యాణియను చానివివాహంబై మహీబృందారక
బృందంబు నహీనదక్షిణల దీనానాథజనంబుల భోజనంబులఁ
ధనంబుల దనిపి పుచ్చియంత॥ ౬౩॥

కం॥ ఆనెలఁత నెపుడుఁ బాయక।
సూనాస్త్రుని కేళియందుఁ జొక్కుచునుండన్।
మానిని నగన నెవిన వే।
యానందోబ్రహ్మమనెడు నాగమఫణుతుల్॥ ౬౪॥

కం॥ ఘనహర్మ్యములనదీప్రాం।
తనవీనకుసుమవనులననందనవనిఁజం।
దనమందానిల మొలయం।
గనువిహరింపగజులలన గర్భము దాల్చెన్॥

కం॥ సూచ్చాదిషడ్బలములవి।
యచ్చరులుండంగజసతియాత్మజుఁగనెన।
త్యుచ్చాకృతినతిబలుఁగడు।
మెచ్చిరదితిజులదితిజులు మెలఁగిరికలఁకన్॥ ౬౬॥

వ॥ అంత గజముఖుం డత్యంతసంతుష్టస్వాంతుండై కొడుకుంజూచి నదికింజేని యుత్తరాభిముఖంబుగ సచేలస్నానం బాచరించి గృహంబున కేతెంచి వేదవేదాంగవిదులైన ధాత్రీదేవులకు గోభూహిరణ్యాది దానంబులు గావించి యాభ్యుదయిక శ్రాద్ధంబు వెట్టి నాందీముఖ పితృగణంబుం దృప్తింబొందించి కుమారునకుఁ గ్రమంబుగ జాతకర్మాది సంస్కారంబులఁ జేయించె, నంతఁ గొంత కాలమునకు॥ ౬౭॥

కం॥ అధియోగంబను యోగము।
విధుఁడుండఁగ సుతులసింహవిక్రములఁగనెం।
బుధవైరిరాణిప్రమదాం।
బుధినోలాడెంగజుండు పూర్ణస్పృహుఁడై॥ ౬౮॥

వ॥ వారికిఁ గాలక్రమంబున సకలవిద్యలు చెప్పించె. వారును శౌర్యధైర్యాదులఁ దండ్రికంటె నుద్దండులై యుండిరి. అంతగజాసురుండు కొన్నాళ్లకు॥ ౬౯॥

మ॥ బహుళాహారముకై వెసంజేనివనిన్ భక్షించుసంతృప్తిగా।
మహిషవ్యాఘ్రవరాహదేహములఁ బల్మాఱున్మహాక్రూరుఁడై।
కుహనారూపములెల్లఁబూనుఁగ్రతువుల్గోల్పర్చుభూదేవతాగ్ర్య।
హముల్గాలుచుసౌమ్యులౌయతుల నాక్షేపించుదూఱున్శ్రుతుల్॥

మ॥ చతురబ్ధుల్వడిదాటుమీటును ధనుర్జ్యావల్లిభీతిల్లిది।
క్షతులాక్కుమ్మడిమూర్ఛజెందనమరీవ్రాతంబుతోబల్మిమై।
రతిసల్పుంబుజమప్పళించునెదలోరంజిల్లునాత్మీయహృ।
ద్గతగౌరీరమణప్రదత్తవరతాగర్వప్రభావంబునన్॥ ౨౧॥

కం॥ ఈరీతిధర్మమెల్లం।
దారూపఱఁగానొనర్చెదానవుఁడుబలే।
క్రూరులకుభాగ్యముబ్బుట।
వారకపాములకుఁబాలభంగింగాదే॥ ౨౨॥

కం॥ ఈగతిరక్కసిసతతము।
వేఁగింపనఖిలవిబుధులుత్స్వరతో।
నేగివిరించింగనిదే।
వాగజునిమహోగ్రపీడవారింపఁగదే॥ ౨౩॥

గీ॥ అనినవేల్పులఁజూచియాయజుఁడువిస్మ।
యంబునొందియంబికనిఁకనరసిమనము।
నవినివినిపించియాతల్లినలువుమీఱ।
నానతిచ్చునట్టులానత్తమనుచులేచి॥ ౨౪॥

కం॥ రాయంచెనెక్కిసురలవు।
రాయంచేభినుతులునేయరహినాజేజే।
రాయండరిగెనుమునులా।
రాయంచేగఁగలేనిరీవిరాణదలిర్పన్॥ ౨౫॥

వ॥ అటఁగైలాసంబున భవాని చిరకాల హరవిరహంబు భరియింపదయ్యె. ఒకరేయి పాండురకిరణుం డుదయించి నభోమండలంబు నలంకరించి నిజమయూఖమండలంబువలన వెడలెడు చంద్రికాజాలంబుచే విరహిజన మానసదోదూయమానుండై యుండెను మఱియు॥ ౨౬॥

కం॥ అలఁదదుగందముగురులం।
గలయఁగదువ్వదువిరులనుగై సేయదుతా।
పులుగలతావులకేగదు।
వెలయఁగఁదొడవులుతొడువదువెడలదువనికిన్॥ ౨౭।

కం॥ అలులకునలుకుంగోయిల।
పలుకులకులుకుంజెలికరువలిఁగడుదూఱున్।
నలినాస్త్రునినాడున్నె।
న్నెలకేనినిఁదెగడుబెగడునెగడువిరాళిన్॥ ౨౮।

వ॥ అనియిట్లు వియోగవేదన కోర్వలేకను దయంబగుడు నిట్లని వితర్కించె॥ ౨౯॥

కం॥ నారాయణుఁడాధారుఁడు।
సారెకునాపదలువాపిసౌఖ్యములీయం।
జారునిఁబంపెదహరికడ।
కారయఁగానిప్పుడనుచునెభృంగివినన్॥ ౩౦।

గీ॥ వాసుదేవుఁజూచిపల్కునేనన్నట్లు।
పలికివానివేగభక్తపారి।
జాతుశాస్త్రవైరిజాతుఁదోతెమ్మునా।
పతినిఁదోడితేరవాఁడెప్రోడ॥ ౩౧।

## ౫. పార్వతి భృంగిని వైకుంఠమునకుఁ బంపుట.

వ॥ నాపల్కు వినుము॥ ౮౨॥

కం॥ అన్నవిపన్నార్తిహరా।
పన్నగశయనాసమస్తవార్తావిదితా।
పన్నగభూషణుఁగూరిచి।
నన్నున్ సుఖవతిఁగఁజేయు నాళీకాక్షా॥ ౮౩

కం॥ ఈమాటలుభృంగివినుచుఁ।
దామోదముతోడఁబోయి దాఁమోదరుతో।
బ్రేమజనింపబలికిగిరి।
జామానినిపనిసలిపెదఁజెక్కఁగననుచున్॥ ౮౪।

వ॥ వైకుంఠమునకుఁబో నిశ్చయించి బయలువెడలి శాకద్వీపమార్గంబువట్టి నదనదీ ధర కాంతార పారావారంబులు దాటి చేని చేని॥ ౮౫॥

కం॥ పరమైకాంతులశరణము।
సిరికేళీసదనముసరసిరుహాక్షుమనో।
హరనిరతనివాసముము।
క్తిరమకుఁబుట్టినయిలు వెలిదీవింజూచెన్॥ ౮౬।

వ॥ అందుఁజేనిచేని పాలవెల్లింగని యిట్లని కొనియాడె॥ ౮౭।

సీ॥ తనపాండిమంబుచేతనయశోదాతనయ
యశోవిశేషంబుబయలుపడుట।
తననభఃకషతకతనహరిపురుషోత్త
మత్వంబుసకలసమ్మాన్యమనుట।
తనదైర్ఘ్యమహిమచేతనతనుజనకున
నంతకల్యాణగుణతదెలియుట।

తనగభీరతచేనతనళినసూతికి
హరిమహత్వమువాచ్యమనుటగలిగి।
యలరెఁగాదుమందారసుధాంశుసురభి।
ముఖ్యజనకత్వసురనదీమోదభోగ।
గమనసింధురాజత్వసత్వమహదాశ్ర
యత్వములఁదెల్పెఁగ్రమమునసారకడలి॥ ౨౮॥

## ౬. వైకుంఠవర్ణనము, భగవద్వర్ణనము.

వ॥ అనిస్తుతియించి యాక్షీరక్షీరధి కుత్తరతీరంబున॥ ౨౯॥

కం॥ హరిభక్తజనోత్కంఠము।
స్థిరనిజవైభవదిదృక్షుశితికంఠము మో।
క్షరమాదానాకుంఠము।
పరమర్ష్యుపకంఠముఁగనెవైకుంఠమ్మున్॥ ౩౦॥

వ॥ అందుఁ గనకమయానేక మణిఖచితప్రాకార గోపురమండప వివిధద్వార శోభితంబును, గూజన్మత్తమయూర విహారసుంద రసకలర్తుఫలితకుసుమితసుమ పరిమళమిళితత గంధవహబం ధురోపవనంబులను, జితంతేపుండరీకాక్షయను శారికల, న దైవంకేశవాత్పరమను శుకంబుల, సర్వంవిష్ణుమయం జగత్తనె డునంచేలను, గమనీయకమల విరజాసంజాత కల్హారకువలయ మరందపానానంద కందళదిందిందిరబృంద ఝంకారసంకులం బును జక్రవాకసారసాదికవిసంచార చారుతరంబును నగునె డలును,జూచుచు నీలగాత్రులుఁ బద్మనేత్రులుఁ బీతాంబరులుఁ జతుర్భుజులుఁ జక్రశంఖధరులునై హరిసారూప్యంబునొంది యున్నహరిభటులంజూచి యొక్కదౌవారికుచేఁ దనరాక వా

సుదేవున కెఱింగించి తదనుజ్ఞం బ్రవిష్టుండై యెడమీక గరుడవి
ష్వక్సేన సునందనందవిజయజయాది పరిచరులును, సనకా
దిబ్రహ్మర్షులును, ముక్తులును, సేవింప నతిసుందరమందిరంబున
ననంతకాంతానంత తల్పంబున సుఖశయనుండై పద్మవనాల
యపదంబులొత్త, భూదేవి సురటివీవ, నీళామహిళామణికపు
రంపు బాగాలొసంగ నిత్య నిరవద్య నిరతిశయ నిరుపమాన
నీలమేఘశ్యామల కోమలశరీరుండును, బీతాంబరుండును, నన
ర్ఘ్య రత్నస్థగిత పరిష్కార పరిష్కృతుండును, జంద్రబింబ
సదృశ వదనుండును, గర్ణాంతవిశాల పుండరీకాక్షుండును,
సున్నతస్కంధుండును, సుభ్రూయుగళుండును, నీలాలకుండు
ను, గంబుకంఠుండును, శ్రీవత్సకౌస్తుభవనమాలాలంకృత రమా
విహారభవన విశాల వక్షస్థలుండును, సకల చరాచర కారణ
విరించి జన్మహేతుక కమలాలంకృత దీర్ఘనిమ్ననాభుండును,
సునాసుండును, నాజానుబాహుండును, సముచిత కటిప్రదే
శుండును, వళిత్రయభాసిత దామోదరుండును, రంభాస్తంభ
సంకాశోరూప్రదేశుండును, సింహమధ్యుండును, ముకురకపో
లుండును, సుదంతుండును, జంద్రికానిర్మలమందహాసుండును,
వజ్రయవాంకుశాది రేఖాలక్షితతారానిభనఖ యుక్తపాదుం
డును, జక్ర శంఖ కౌమోదకీనందక శార్ఙ్గధరుండును, సాలోక్య
సామీప్య సారూప్య సాయుజ్యంబులను చతుర్విధ ముక్తులకుం
గర్తయై చతుర్దశలోక సర్గపాలనోప సర్గంబులు తాఁగాని
యట్లక్రమంబునఁ జేయుచుఁ బరమానందుండై యాత్మారా
ముండై, షడ్గుణానంత కల్యాణగుణనిధియై, ప్రత్యంగ సౌందర్య
విభవ నిత్యయౌవనఖనియై యవాఙ్మానసగోచర ప్రభావుండై
వేంచేసియున్న శ్రీవాసుదేవు సందర్శించి సభక్తికంబుగ సా

ష్టాంగం బెఱగి తదాలోకనజనిత రోమాంచుండై హర్షవిస్మయం
బులను దుర్నిరీక్ష్య దేదీప్యమానానన్య తద్దివ్య తేజోరాశివలన
భయంబును ముప్పిరిగొన నెట్టనదిట్టరయై వెండియుఁ జూచెదఁ
గాక॥ ౯౧॥

మ॥ అనియాపాదశిరంబు భక్తివివశుండై చూచి సానందబా।
ష్పనిరుద్ధేక్షణుఁడై వెసం దుడిచి విస్పష్టంబుగాఁ గాంచిలో।
చనముల్గల్గిన దాని కేఫలము దా సంలబ్ధమయ్యెం గదే।
కననైనం దనివోదటంచును దదేకధ్యానచేతస్కుఁడై॥ ౯౨॥

వ॥ చూచి యిట్లనె॥ ౯౩॥

శా॥ ఈతం డాశశివర్ణుఁ డంచిపుడు నే నెట్లాడఁగా నేర్తునా।
శ్వేతద్వీపముక్షీరవారినిధియున్ శేషుండు దా నున్న దా।
శ్వేతం బైనను గాదటంచు నతసీశృంగారనీలోత్పల।
స్ఫీతాంభోదములన్ హసించు సుషమాశ్రీ దేహిగాఁ బోలెడిన్॥

వ॥ అని॥ ౯౫॥

సీ॥ ఓంకారవాచ్యాయ పంకజనాభాయ
ప్రద్యుమ్నరూపనిర్మాణనిపుణ।
భగవతే వ్యక్తాయ పాలకతే నిరు
ద్ధస్వరూపాద్వైతతత్త్వవేద్య।
వాసుదేవాయ సంవర్తస్వరూప సం
కర్షణ సనకమహర్షిసేవ్య।
నమ యటంచును వీర్యసుమహదైశ్వర్యతే
జశ్శక్తిబలబోధసమభిధాన।

ములగు షడ్గుణంబుల పూర్తి వెలయ నిస్స।
మాభ్యధిక దేవున నితరలభ్యచారు।
మూర్తి నమితార్తివిచ్ఛేదికీర్తనీయ।
చరితు వ్యూహాధినేతను సన్నుతించె॥ ౯౬॥

కం॥ విపులమగు ప్రకృతికంటెను।
నిపుణుఁడు పెద్దఁడై యణోరణీయానను నీ।
యుపనిషదర్థముగతియై।
ట్లోపరుఁ డఖిలశక్తిమయత నుండఁడె యెందున్॥ ౯౭॥

వ॥ అనియిట్లు బహుభంగులం బొగడిన హృషీకేశుండు సంతసించి యుచితాసనంబునఁ గూర్చుండ నియమించి వచ్చిన కార్యంబడుగుడు గౌరీసమాచారంబు విన్నవించినఁ జిత్తగించి వానికి సత్కారంబు చేసి వచ్చెదఁబొమ్మని వీడ్కొలిపిన వాఁడును గైలాసంబున కరిగెనిటు హరియును సరగనరుగవలయు॥ ౯౮॥

చం॥ అనిసిరిఁగూడి యాయుధములైదును దాల్చి విభూషణంబులు।
న్ననలును బూని పక్కిదొరనల్వగ నెక్కియు వెండికొండకుం।
జని గిరిజాతఁ గాంచి సతిచేయ్యన మ్రొక్కుచుఁ జేయు పూజలె।
ల్లను గొని పూలుభూషలును లాలన మొప్పఁగ నిచ్చి యిట్లనున్॥ ౯౯॥

గీ॥ ఏలననుఁ గోరి రప్పించితిందుముఖిరొ।
నాఁగ నాగజా సురునుదంతమును జెప్పె।
నాగభూషణు దేవియా నాగడచిన।
పనికి వెతఁ జెందకమ్మ నీవనియె శౌరి॥ ౧౦౦॥

## ౭. దేవతలతో బ్రహ్మ కైలాసమున కేగుట.

కం॥ దేవతలందఱుఁ గొల్వఁగ।
దేవజ్యేష్ఠుఁ డరుదెంచి దితిజారినుమా।
దేవినిఁ గని కేల్మోడిచి।
కైవారముఁ జేసి చెప్పె గజకృత బాధల్॥ ౧౦౧॥

ఉ॥ ఆవిధమెల్ల వించునుమ యబ్జజునిట్లను నేనిదేక దా।
భావములోనఁ బూని నవపంకరుహాక్షునిఁ బిల్వఁబంచితిన్।

నా వెతదీర్పనిచ్చటకనంతుఁడువచ్చెనితండుమీరలున్।
ధీవిలసిల్లఁజేయుఁడొకదివ్యపుయుక్తినన్నబ్రహ్మయున్॥

వ పొట్టనిండఁబుట్టెడు బుద్ధులుగల యీగట్టిదిట్టయె యెట్టియుపాయంబైనఁ జేయంగలండు. అనుడు నగి తొగచెలియనుఁగుమఱంది యిట్లనియె. మీకంటెనా తెలిసినది లేదు. అయిన వినుండొకటిచెప్పెద గజాసురుండు విచిత్రలీలావినోద లాలసుండనియు హాస్యలాస్యముల మెచ్చువాఁడనియు విందుము కాన నాయెఱింగిన తెఱంగు వివరించెద నంది నెద్దుం జేసి బ్రహ్మయు నారదుండు నింద్రుండును నేను తదుచిత వేషంబులం బూని యేగి గజాసురునిఁగని యాడి పారవశ్యమ్ము నొందింతము అంతనతండు వరమడుగుఁడనును. పిమ్మటఁ గొమ్ముల తేజివాని వక్త్రమ్ముఁజీల్చి మదనమథనుఁ దెచ్చునట్లు వరము గోరుదము వాడిచ్చును. మన యభిలషితంబు ఫలితంబగు వాఁడు మడియును. లోకంబులకు సౌఖ్యంబు గలుగును. అని చెప్పినవారెల్ల రుల్లసిల్లిరి పార్వతి యూరడిల్లె. ఇంద్రుండు దక్క దివిజులు దివంబునకరిగిరి, నారదుండునువచ్చె, గంగిరెద్దు వేసములు దాల్ప నిశ్చయించి నారదుండును, నారాయణుండును, నముచిసూదనుండును, నాళీకోద్భవుండును, నందిం దోకొని వలయు సామగ్రిం గైకొని చేనిచేని గజాసుర పుంగవుప్రోలి చెంగట నొక్కవిజనప్రదేశంబున విడిసి దూరగమనాయాసంబు దీర్చుకొని॥

---

## ౮. బ్రహ్మాదులు గంగిరెద్దు వేషములు వేయుట.

సీ॥ గీఱునామంబులు గేరుచుఁబెట్టియుఁ
గోరపాగలుచుట్టియోరలందు।
బంచవర్ణపుటీఁకలుంచియుంచినిలువు
టంగీలుదొడిపలురంగులైన।

పూసలపేరులువేసియునెల్లె
వాటులనీటులుల్లసిల్ల।
సన్నాయిడోలునుజిన్నిగంటయుఁదాళ
ములఁబూనినందికిమూఁపురమున।
వెన్నునసరిగవల్వలువేసివెండి।
గొరిజలునునిద్దపుఁబసిఁడికొమ్ములొప్ప।
నడుముఁబయిఁడిపట్టెడఁజొట్టికడఁకముక్క।
నందుఁద్రాడుంచియేగి రాయసురపురిని॥ ౧౦౪

కం॥ హరిసూత్రధారిడోల్గానె।
హరివిధివీరణముఁబూనెనజజుఁడుసన్నా
యిరహింగై కొంచుగజా।
సురనగరీరాజవీధిఁజొచ్చిరియంతన్॥ ౧౦౫

కం॥ పరమాత్మతేజమొకొ।
యరయఁగమిఱుమిట్లుగొల్పెనందఱకనునా।
పురజనులయులివురోదోం।
తరములనిండెనుని తాంతతాండవమగుచున్॥ ౧౦౬

కం॥ వారును రాక్షసుసింహ।
ద్వారముఁజేరంగబోయిదౌవారికుతో।
మా రాకదెల్పు వేగమె।
మీరాజునకనఁజేనికడు మెలపునవాఁడున్॥ ౧౦౭

మ॥ హితసామంత సుధీకవీశ్వరనట ద్ధేలావతీసత్పురో । హితమం
త్ర్యాత్మజ బంధుసైన్యపలస ద్ధేత్యుజ్జ్వలద్వీరసం । యుతుఁడై
యొప్పెడు నాగజాసురుని నత్యుల్లాసినీక్షించితా । బలిసూడ
న్ప్రమ యంబుగాంచియనెసం భ్రాంతాత్ముఁడై వానితోన్॥

ఉ॥ దేవగజాసురేంద్రనతదేవకిరీటమణీమయాంఘ్రిరా।
జీవపరాకువిండెయొకచిత్రమునల్వురకృత్రిమాకృతుల్।
పావనమూర్తులత్యనలభానులుగోవృషంబుతో।
దేవరఁజూచుకోర్కెనరుదెంచిరియానతియేనిపిల్చెదన్॥

కం॥ ఏమేమియంతచిత్రమె।
యామనుజులఁదోడితెమ్మయనియతఁడనుపన్।
స్వామీయనివాఁడరిగియొ।
హేమమహనీయులరుదెండుహొయలుచెలంగన్॥ ౧౧౦॥

వ॥ అనినవారువచ్చిరి॥ ౧౧౧॥

ఉ॥ వచ్చినవారినల్వురనువారకచూచిమహామహుల్ బళీ।
యచ్చెరువయ్యెడింగనఁగనబ్జజవిష్ణుసురేంద్రులేమొకో।
మెచ్చినగబ్బఁడాహరునియెక్కెడితత్తడిగాదెయెవ్వరో।
యచ్చుగవిందుఁగాకనుచునాగజుఁడప్పుడువారికిట్లనున్॥

కం॥ మీదేదేశంబెటకీ।
రిదారినిఁబోదురెవ్వ రీరలుమీభా।
గ్యోదయనామంబులుచెపుఁ।
డాదనుజాగ్రణివినన నల్లననగుచున్॥ ౧౧౩॥

వ॥ కేశవుండు వాని తేజఃప్రతాప ప్రతిభా విశేషంబులకు లోలో మెచ్చుకొంచుఁ జతురోక్తి నిట్లనియె. రాక్షస వంశ శేఖరా, దృష్టిమాత్రవిధ్వస్త సమస్త ప్రత్యర్థిముఖ్యా, యాశ్రితకామిత వరప్రదాన దీక్షాదక్షా, వినుము. మాదొక దేశంబుగాదు. అంతటఁ దిరుగుచుందుము; సత్పథంబునజేని పరమయోగ వైభవంబుననున్న రాజహంసలఁ జూతుము. మాకొకకులంబని యింక నేర్పడలేదు. ఈతఁడు బ్రహ్మవాది. ఇతఁడు జయంత

శాసనుఁడు. ఇతఁడు నిజసంగీతవిద్యా ప్రవీణతా ప్రవాహీభూత పాపాణుండు రెండవనారదుం డనఁదగు బృహన్నారదుండు. ఇది సర్వజ్ఞా నందినంది, నేను విశ్వంభరుండ. మఱియు నేమందఱముఁ బ్రమదపుణ్య జనవిభంగ స్వానుహరణ దక్షులము. చూచెదేని మాయాట నాడించెదము. లేదేని వేఱొక విలాతికిఁబోయెదము. అనుడు వాఁడాద్వ్యర్థ పరమార్థబోధక నిర్భయ వాక్ప్రచయంబున కద్భుతప్రమదంబు లుదయింప వీంద్రు సామాన్యులుగారు. ఈవేషంబు లీవిద్దెయుఁ గ్రొత్తవై యున్నవి, యీయాటఁ జోతుంగాకయని నిశ్చయించి యాటకు సెలవిచ్చె; అంత నడికట్లు దిట్టపఱిచి, తలగుడ్డలు సవరించి॥ ౧౧౪॥

సీ॥ చేగంటవాయించుఁజిన్నికృష్ణుండంత
వీరణంబునుగొట్టువేల్పుపెద్ద।
పరువెత్తుచునుడోలువాయించుసురతాణి
నారదుండపుడుసన్నాయినూఁదు।
నందినడుమఁబెట్టివలగొని
పాడెదరాడెదరీడుఁగూడ।
నదివారియింగితంబరసియెన్నాపోణు
ములగంతులనువైచుముదముతోడ।
నేనుఁజెప్పెడిదేమిమానీంద్రులార।
యాగజాసురుండుసభయునద్భుతపడె।
మఱియునెక్కుడనేర్చిరోమహితవిద్య।
యనుచుసభ్యులాడుచునుండిరచేటనపుడు॥ ౧౧౫॥

కం॥ హరిమాయయొకఁడెజగము।
చ్చెరువుపఱుపఁగేవల హరిజిష్ణ్వజతద్భా।

హరవాహనములుపరవశ।
తరహింజేయుటయరుదఁటె దైత్యులకులమున్॥ ౧౧౬॥

వ॥ అంత గజాసురుండు పరమాశ్చర్యంబై మైమఱపునొంది
తెలిసి॥ ౧౧౭॥

## ౯. గంగిరెద్దువాం(డకు గజుఁడు వరమిచ్చుట.

కం॥ మెచ్చితినాటకుఁగోరిన।
యిచ్చెదఁబ్రాణంబునైన నిప్పుడెయనివాఁ।
డెచ్చిన మోహమున ననఁగ।
నచ్చపుమాయావియైన హరియిట్లనియెన్॥ ౧౧౮॥

గీ॥ ఇతఁడుబ్రహ్మయింద్రుండితఁడు నార।
దమునియిదిమహాదేవునితత్తడిగద।
రాక నేభ్యయే నాదినారాయణుండఁ।
బ్రాణమిచ్చెదనన్నని పలుకుమఱకు॥ ౧౧౯॥

ఆ-వె॥ఆడితప్పరాదుచూడంగపాపము।
న్యంబుదానికంటెనధికమేది।
నందినీయుదరమునందుఁజొచ్చిశివుని।
దెచ్చుఁబోపనిమ్ము దేనువరము॥ ౧౨౦॥

వ॥ అనినవిని యతండు గుండెలుజల్లుమన బెండుపడిమూర్ఛిల్లి కొం
తసేపటికిఁ దెలిసి నిఖిల నిశాచర నిబర్హణ నిపుణుండగు నారా
యణుచే మోసపోయి తనివగచుచు వగచిన నేమని ధైర్యం
బూఁది హరికిట్లనియె. మహానుభావా శివుమూలంబున నవాఙ్మా
నస గోచరుండవగు నిన్నును బ్రహ్మేంద్రాదులఁ జూడఁగలిగె.
ధన్యుఁడనైతి, నాగోత్రంబు పవిత్రంబయ్యె, నాపుణ్యంబు ఫలి

యించె, మీకంటె నుత్తము లెవ్వరు మీకై ప్రాణంబులవిడుచుట కంటె నాకువలయునెద్ది, నాదొకవిన్నపముగలదు. నాచర్మంబు శివుండెపుడు ధరించునట్లు, నాశిరంబు సాంబునింబలెం బూజ్యంబై యుండునట్లు వరంబు వేడెద. నాఁజొట్టు వాల్గల జెట్టియట్టె యనె. అంత గజాసురుండు తన యగ్రపుత్రు భీమాక్షు భీమాక్షునిఁబిల్చి సూక్ష్మరీతి రాజనీత్యాదు లుపదేశించి పట్టంబుగట్టి రక్తాక్షు ద్వితీయపుత్రు యువరాజుఁగాఁ జేసి ఖిన్నులై యున్న ప్రెగ్గడలఁ బరిజనుల దగ్గఱఁజేరి యుత్సాహంబు గల్పించి వారి యనుమతి శ్రీమన్నారాయణాదులకుఁ గేలుమొగిడిచి శ్రీగౌరీశు సంస్మరించి యాభీలంబగు వక్త్రబిలంబు దెఱచె నంత॥

గీ॥ నందివానివక్త్రబిలమునల్లదూరుఁగఁ|
పసదుకొమ్ములచేఁజీల్చిదనుజుకడుపుఁ|
జొచ్చిశివుఁగాంచితాశూలియెక్కె|
వచ్చెఁగోలువెల్లనబ్బురపాటుఁజెంద॥ ౧౨౨॥

గీ॥ ఆగజాసురుతేజంబుహరునియందుఁ|
గలసెనంతకుమున్నెయాగరుడిహంస|
మఱియునుచ్చైశ్శ్రవంబుఁబ్రమదమెసంగ|
నచటవచ్చిసిద్ధమ్ముగానమరియుండె॥ ౧౨౩॥

కం॥ హరుఁడప్పుడుబసవనిడిగి|
హరిహరినారదవిధులకునెహాశిన్మీ|
కరుణనుసతిఁగూడఁగలిగె|
హరిమునుమఱిగూర్చినాఁడవగజకునాకుఁ॥ ౧౨౪॥

గీ॥ ఇట్లనుచునుండగజునినిశ్శేయచర్మ|
శిరములనుదెచ్చితద్భటుల్ శివునికీయ|

వానిఁబూనిరక్కసులకునొసఁతిచ్చి।
నారదాయేగినారాకగారవమున॥ ౧౨౫॥

కం॥ శివకుంజెప్పుమఁటంచును।
శివుఁడతనింబంచియంత శ్రీపతిసుతా।
మవిధులుతానునుదమవా।
రువములనెక్కి చేనుచుండఁ ద్రోపనొకయెడన్॥ ౧౨౬॥

వ॥ దీనుండై దుఃఖించు నొకమానవునిఁజూచి నీవెవండవు ఇట్లేకతం బేకతంబునవగచెద విటకేలవచ్చితనియడుగ వాఁడిట్లనియె॥

కం॥ మిథిలాపురనిలయుఁడ నేఁ।
బ్రథితయశుఁడుజనకరాజరత్నముదత్త।
ద్విథినాయాకులజులువ్వ।
త్త్యధికారములీగకుండనవనిభరించున్। ౧౨౭॥

కం॥ ఏనొకసంకరకులజుఁడఁ।
గానొకవృత్తియునులేదు కావుననన్నుం।
బోనడఁచెంబురివలనద।
యానిధులీరేని ప్రోవుఁడారసినన్నున్॥ ౧౨౮॥

వ॥ అనినఁ ద్రిమూర్తులు కృపాయత్తచిత్తులయి వానికిఁ దమయం దుఁగల పూర్వజన్మ భక్తిక్రమంబునకు సాఫల్యంబుగ వానికిఁ దత్పుత్రుల కీగంగి రెద్దువిద్దె నుపదేశించి తమసన్నాయి మొదలగు సామగ్రినిచ్చి యీవిద్యచే జీవించునది యనిచెప్పి వీడ్కొలుప వాఁడత్యంత సంతుష్టాంతరంగుండై వారికివందనంబు లాచరించి తూర్ణంబున సకుటుంబంబుగ మిథిలకేగి జనకునిదర్శించి మహాను భావా నీచేవివానితుండనై కొండొకదవ్వేగి మూవురఁ బుణ్యాత్ముల నతిమానుష సుషమాశోభితులంగంటి వారొకవిద్దెఁజెప్పి తదు

పకరణంబులొసంగి యాజీవంబుకల్పించిరి. కాననీపురిన వసించెద నానతండుసంతసించి తల్లిలావినోదంబులు సూచివానికి బహుమాన పూర్వకంబుగ నెలవిచ్చె. వాఁడువిదేహ పురంబు నఁగాపురంబుండె. నాటంగోలె గంగిరెద్దు విద్దెయిద్ధర నెల్లెడమొల్లమైయల్లిబిల్లిగ నల్లుకొనియె. అటుబ్రహ్మాదులును బోవుచో శివునింజూచి॥ ౧౩౦॥

---

## ౧౦. శివకేశవ పరస్పర సంలాపము.

కం॥ సరసిజాక్షుండిట్లనె।
సురరిపులుతపంబు నేసిచొక్కంజేయం।
బరవశతనొందివారికి।
నురువరములనిచ్చెదొరయుబ్బులలింగా॥ ౧౩౧॥

గీ॥ మీఁదుమిక్కిలియగుఁగొన్ని మేటివరము।
లవలసవరింపఁబోయిననధికబాధ।
గలుగునన్నఁబన్నగతల్పఁగనిహరుండు।
నగుచునిట్లాడెఁజతురత్వమగుపడంగ॥ ౧౩౨॥

సీ॥ నన్నాడనేటికోనాళీకపత్రాక్ష
శబరియెంగిలిమెక్కి స్వర్గమీవా।
వెన్నబెట్టినగొల్లకన్నెలకీయవా
కూర్మితోనిత్యవైకుంఠపదముఁ।
గుబ్జతోరతికేళిఁగూడిదానికినవ్య
సౌందర్యమీయవాచక్రధారి।
యటుకులుసాపడియాకుచేలునకీవా
తఱుగనిభాగ్యము ల్తప్పకపుడు।

లంచేఁగొండివినీవు నేఁగొంచెమయిన।
నట్టివారలయుపకృతి కాసపడక।
మానసపరీక్షఁ జేసియిచ్ఛానుకూల।
వరములిచ్చెదనాహరిపక్కననగి॥ ౧౩౩॥

కం॥ ఔనాభస్మాసురునకు।
నానాఁడవ్వనమునమనమరసియెవరమున్।
మానకయిచ్చితిపాఱితి।
ప్రాణభయంబున నెఱుఁగుదుబళిరానిన్నున్॥ ౧౩౪॥

కం॥ వరసంలాపములీగతి।
హరిహరులాడుచుఁ జేనిచేనిహరువీడ్కొనిశ్రీ।
హరిహరిహయకమలాసను।
లరిగిరినిజపురములకపుడానందముతోన్॥ ౧౩౫॥

గీ॥ పురముఁ జేరుచో దేవతాగురునిఁజూచి।
శివుఁడుపార్వతి యిపుడేమిచేయుచుండె।
జెప్పుమననీదు రాకడజెప్పెనజజుఁ।
డామెజలకమాడుచునుండెననియెగురుఁడు॥ ౧౩౬॥

## ౧౧. వినాయకవృత్తాంతము.

సీ॥ అటమున్నె నారదుం డగజాతకడ కేగి
తనుపోక మొదలు దంతంబు చెప్పి।
శివురాకఁ జెప్పఁగా జిత్తంబు మెత్తగాఁ
దైలాభిషిక్తయై తగనలుంగు।
విడితానునీరాడ నేగుచుఁగాంతుండు
గ్రక్కునరాకుండఁ గాచియుండ।
నుద్వర్తనంబుతో నొకబొమ్మ గావించి
ప్రాణంబుగదియించి పలికెనోరి।

వత్సయెవ్వారి రానీకుపర్వతసుత।
జేలకమాడుచుండె ననుముజేంకకీవు।
నాఁగమంచిదనె నతండునగతనూజ।
యేగెమజ్జనశాలకు నెసకమెసఁగ॥ ౧౩౭॥

కం॥ అంతటవృషభమ్ముడిగిని।
శాంతముఁజొచ్చి శివుఁడుబహుసత్వరుఁడై పో।
వింతగఁబోకుము పోకుము।
పంతముచేనదనుసల బొమపలుకులువించున్॥ ౧౩౮॥

కం॥ ఏమియెవ్వఁడవోరీ।
నాముద్దుకొమరుఁడ శివకునమ్మముచేనకో।
కామాగియనఁగశిరమధి।
కామర్షమ్మున నజీకెఁగరానిసుధారన్॥ ౧౩౯॥

వ॥ అంతఁదచ్చిశువుగాత్రంబున రక్తంబుదొరుగనేలంబడె॥ ౧౪౦॥

గీ॥ జలజదళనేత్రపార్వతి జలకమాడి।
వచ్చిపడినసుతునిఁ జూచివగచిశిశువు।
నకటచేంపితేలని విభునడుగనిప్పు।
డార్యనీళ్లాడుచుండు నంచనియెగురుఁడు। ౧౪౧॥

కం॥ నిక్కమొగాదోయనికన।
నక్కడకేరాఁదలంప ననెబోకనినే।
గ్రక్కుననఱకితిమిగిలిన।
యీకార్యమునకువగవకు మింతీయన్నన్॥ ౧౪౨॥

సీ॥ గురుఁడేడవచ్చెనో కోరినప్రశ్నంబుఁ
జెప్పఁగాఁజెప్పిన గొప్పయనుచు।
దృష్టాంతమునుజూడఁ దివిరివచ్చుచునీవు
చెండితికోపివై నీసుతునిరము।

జ్యోతిషంబిది మొద లసత్యంబుగాదని
  క్రోధంబుతో జండి కొంకకనియెఁ
గాములిఁక ముందు కర్జమ్ము నెంతు రేయని
  లోననసుకొని యంగజారి
శాపమీరీతినీ కన సత్యమన్నత
మాన నెనుమయంతట హరుండసువులొసఁగి
తివితనికి నేనుఁగొట్టితిఁ దిరుగఁగజుని
శిరమునిడి ప్రాణముల నిచ్చి చెలియవీని॥ ౧౪౩॥

వ॥ రక్షించి యభివృద్ధికిం దెచ్చెదనన్న హైమవతిశాంత చిత్తయై యొప్పె శివుండు నలుంగుఁబిండిబొమ్మ కతలువిని గజాసురుశిరంబునా ప్రతిమా కబంధంబునకుం బెట్టి ప్రాణప్రతిష్ఠం జేసి గజాసురవృత్తాంతంబంతయు నెలంతకుఁ బ్రాక్రుచ్చి యిట్లనియె. గట్టుపట్టి మొట్టమొదట నీవో ర్తవెయీ మూర్తిం జేసితివి గానఁ బూర్తిలే దిప్పుడు నాచేఁ బునర్జీవితుఁడయ్యె, నింకొకవిశేషంబు గలదు వినుము. వీని యుత్తమాంగంబు పూజార్హంబై కుమారునికి నేదేని శుభోదయంబువై శంబకాఁగలదు. నీవలంకృతవై రమ్మనసమ్మదమ్మున నమ్ముద్దుగుమ్మ నెరులుదువ్వి దువ్వాలువలుగట్టి యలరులఁ బెట్టి కలపములఁది కస్తూరి తిలకంబు వెట్టి రత్నఖచిత తప్తతపనీయాభరణంబులు ధరించి సుతుని సింగారించి మూషకంబు వాహనంబుగానిచ్చి తోకొని యొయ్యారమున రారాజశేఖరుండు గారాబుఁజేసిన గొమరునిఁ జూచి ప్రమోదించి యయ్యింపుఁ బోఁడి పాళి నాలింగనంబు చేసి సరసోక్తులాడుచుండె. అట్టిదిదినంబున నింద్రాది దేవతలు రాక్షసులతో యుద్ధములొనర్చి నేనలనడిపింప మనము చాలకున్నారము ముక్కంటి వేడికొని యొక్కదళవాయిం బడయవలయునని యేకవాక్యంబుగాఁ బలికికొని బయలువెడలి కైలాసాభిముఖులై బహుదూరంబు నడిచి॥

కం॥ భాసురరుచిజితరవిశశి।
భాసముఁదటవిహారమాణ వరసురవనితో।
ల్లాసముసుగంధపుష్పవి।
కాసముముదముననుఁ గనిరి గైలాసమ్మున్॥ ౧౪౫॥

సీ॥ హరుఁడుతదీయభూషణచయంబగుగంగవిధుండునస్థులున్।
వరవృషభంబువాసుకియుఁ బావనమైనమహావిభూతియు।
న్నిరతముపొందుతాస్ఫురణ నెక్కొనగన్గొనితానునీమహీ।
ధరుఁడుఁదదేకవర్ణమునెతాలిచె ధన్యులుస్వామితత్పరుల్॥

## ౧౨. కైలాసవర్ణనము.

వ॥ అందుఁజేని మాణిక్యోపశోభిత ప్రాకారపరిఖాదులతోఁడఁ బుష్పిత ప్రమదవనసారసారసపూరిత కాసారంబులతోఁడఁ బలుతెఱంగులగు సింగారంబులంగలిగి చెలంగుచున్న దాని కానందించుచు ననేకమృదువిహంగమ రుతంబులకలరుచు ద్వారపాలకుచే రుద్రునకువార్తఁబుచ్చి తదనుజ్ఞ ననేక కక్ష్యాంతరంబులుగడచిచని త్రిశూలధారులును భసితాంగరాగులును రుద్రాక్షమాలాలంకృతులునునై శివుంబోలియున్న మహాభైరవనందికేశ్వర వీరభద్ర వీరప్రతాపప్రముఖ ప్రమథగణశైవకింకర సంకులంబైయుండఁజేనుచు శివాత్పరతరంనాస్తియను నేకాంతుల శివోహమనుయతులఁగనుచుఁ జంద్రమౌళియు జటాజూటగంగాలంకృత శిరుండును నీలకంఠుండును, భూతిలిప్తశరీరుండును నాగాభరణుండును, సూర్యేందులోచనుండును, జగద్విలయకాలాగ్నిలన యోగ్యఫాలస్థ నిమీలిత తృతీయాగ్ని నేత్రుండును కృపాసింధువును, సగుణుండును యోగీశ్వరుండును భక్తపరతంత్రుండును నిర్మలస్ఫటిక మణిప్రభాపటల భాసమాన దివ్యశరీరుండై

వ్యాఘ్రాసనంబున నున్న పరమశివును మా సహాయుం జూచి నిటు
లతట ఘటితాంజలిపుటులై మ్రొక్కి లేచి యిట్లని స్తుతియించిరి॥

చ॥ జయశశిశేఖరాయ మునిసన్నుతపాదసరోరుహాయతే।
భయకృదరాతిపాటనవిభాసిబలాయ శివేశ్వరాయ భూ।
తియుతశరీర భక్తజనదేవమహీరుహా ఓన్నమశ్శివా।
యయని నుతించి రంచిత దిగంబరమూర్తినిఁ జూచి ప్రీతులై॥

సీ॥ పులితోలు నెమ్ములుఁ బుఱియల పేరులుఁ
జిలువలు బూది పూఁతలు జడలును।
భూరిరుద్రాక్షలు భూషలుగాఁ దాల్చి
యాదిభిక్షుం డయ్యె నకట యితఁడు।
ధనదుండు నెచ్చెలి తనమామ
రత్నాకరుండఁట యిల్లఁట వెండికొండ।
యైనఁ బురాకృత మనుభవింపక తీఱు
నెట్లు గొండను గొట్టియేని కొన్ని।
నాళ్లు భోగింపఁగా రాదె నాతియైన।
నుడువ వెఱపొందుఁ దామసుండును బిశాచ।
యుతుఁడు కుత్తుక విషమూని యుగ్రుఁడునయి।
యుంటనని యనుబోగడి రయ్యుజ్జ్వలాంగు॥ ౧౪౯॥

వ॥ అంత సర్వేశ్వరుండు సర్వమంగళావల్లభుండు వారల సకరు
ణంబుగఁ జూచి యర్హాసనంబుల నుండనేమించి వచ్చినకర్జంబు
నడుగ జేజేలిట్లనిరి. దేవా యాభీలరక్షోజాలంబుతో నాలమ్ముఁ
జేసి చేరువలనడిపింపం జాలకున్నారము. కావున మాకు శౌర్య
ధైర్య వీర్యబాహుబల సంపన్నునొక్క సేనానిం దయ సేయు
మనుడు శంకరుండు నగి మంచిదని సెలవొసంగ వారు నిజావా
సంబుల కరిగిరంత॥ ౧౫౦॥

కం॥ గిరిశుఁడుగౌరీసతితోఁ
జిరకాలముక్రీడసల్పజిష్ణ్వాదికని।
ర్జరమోదవిధాయిగలిగెఁ।
బరుఁడుకుమారుఁడుమారుప్రతియోనాఁగన్॥ ౧౫౧॥

వ॥ ఇట్లు కొంతకాలంబుగడచిన గీర్వాణులుమరలవచ్చిరి. అవుడు మామహేశ్వరులుకుమారుఁ గుమారు దేవసేనానాయకుఁగా నభిషిక్తుంజేసి దేవసేనయనుకన్యం బెండ్లిసేసిరి. విశాఖుం డప్రతిహతబలుండై యసురులతోఁగదనంబులుచేసి యోర్చుచుండె. మఱియునిట్లు కొంతకాలంబుచేనిన దేవతలరుదెంచి॥ ౧౫౨॥

కం॥ పన్నగభూషణవేల్పుల।
కెన్నఁడుసేనానినొసఁగియేలినకరణిం।
జేన్నమువ్రతములువిఘ్నము।
లెన్నఁడుఁబడకుండజరుపనేలికనొకనిన్॥

కం॥ దయచేసినదితిజులచే।
భయములుగలుగవుజగములభవ్యచరిత్రా।
నియమింపువేగననహరి।
హయాదులకుననెహారుండుహర్షముతోడన్॥

కం॥ ఊపీరలజునినగరికి।
మీపరివారములఁగూడిమిగిలినసురలుం।
జూపఱువాగడఁగవచ్చిన।
నీపనియఝుఁడచటఁజేయునేగుండీరల్॥

గీ॥ అనినవారేగిరీపనియూర్మ్యగముల।
వానికననగౌరిగోపించునేనుఁగుమొగ।
ముగలవానికన్నగుహుండలుగునఁటంచు।
బంపెఁబుత్రులనీశుండుబ్రహ్మసభకు॥

క॥ వారేగి బ్రహ్మఁగనిజో।
హారొనరిచినలువయాజ్ఞ నాసనములపై।
నారూఢులై పనిఁదెలుపం।
గారాయంచరవుతనియె గాంభీర్యమునన్॥ ౧౫౭॥

క॥ ఇలముక్కోటేబదిల।
క్షులునదులనుబుణ్యతీర్థ సమితియుఁగలదం।
దెలమిమునిఁగిరెండేగడి।
యలుధరనగునంతకిచేటకరుదెండీరల్॥ ౧౫౮॥

క॥ మిలోమున్నఁగవచ్చిన।
బాలునకిచ్చెదఁజెబుపులపనిదొరతనమీ।
వేళఁజేనుఁడుపురమునకుం।
జోలఁగడఁగుఁడెల్లి మీరుస్నానంబాడన్॥ ౧౫౯॥

క॥ అనవారలజునివీడ్కొని।
చేనుచోఖిన్ననిగజముఖుఁజతురత్వముతో।
సనెషణ్ముఖుఁడో వెఱ్ఱీ।
ఘనమగునుదరంబుతోడఁగదలంగలవా॥ ౧౬౦॥

క॥ నీవేడస్నానమేడ।
న్నీవిఘ్నేశత్వమేడనెరయదుమాకే।
చేవగలారికిఁగడుశ్రమ।
యావిడుమండనిఫలములకాసలుదగునే॥ ౧౬౧॥

క॥ తనకడ్పువిధిపలుకుగుహుఁ।
డనుమాటలువినిగజాస్యుఁడడలెడుమదితోఁ।
జేనిజననికిమ్రొక్కియనియెఁ।
గనుఁగవబాష్పంబులొలుకగద్గదికమునన్॥ ౧౬౨॥

కం॥ అమ్మాయిక్కడనుంచిన।
నెమ్మదినుందునుగదమ్మనిందలఁబడితిం।
బమ్మయుగుహుఁడునునాడిన।
యమ్మాటలుములుక్కలయ్యెనకటానాకున్॥ ౧౬౩

కం॥ నీనేర్పునీయుపాయము।
నూనియెనాయూసదీర్పనూహించితోకో।
నేనేడనెల్ల నదులను।
స్నానమ్మేడఁబ్రభుత్వసంపదలేడన్॥ ౧౬౪॥

వ॥ ఈపనిచెఱుపుల దొరతనంబుజేతనంబు చేలుఁజోలునని వెక్కివెక్కియేడ్చుచున్న సుతునింజూచి యార్యయూరార్చి ముద్దాడియీపనినీకిప్పించెద నూరకుండుమని॥ ౧౬౫॥

మ॥ స్తనభారంబునడన్సికౌనువడఁకందారుణ్యలావణ్యయై। [నూ।
నునుఁగెందమ్ములఁబోలునంఘ్రులిల పైనూల్కల్పితోట్రొంద
తనశృంగారముమీఱనాత్మజునితోడానేగునెయ్యారముం।
గనినాథుండతిపారవశ్యముఁగనంగాఁజేరితానిట్లనున్॥ ౧౬౬॥

గీ॥ ఓయికరుణాబ్ధిగుహునకునెసఁగితమర।
సైన్యనాధత్వమితనికిసమ్మతిల్ల।
విఘ్నరాజత్వమిమ్ము నావినిశివుండు।
వల్లెయనెఁబతి శృంగారవతికవశుఁడె॥ ౧౬౭॥

వ॥ అంతకుమున్నె కుమారుండు సత్యలోకంబునుండివచ్చుచుఁదమకేమనిగర్వించియుండె. అతనికీయధికారంబు గలుగదని శర్వుండునిశ్చయించి విన్ననైయున్న చిన్నారిగున్న చిన్ని మొగంబు గని గజాసురున కిచ్చిన వరంబును వానిశిరంబునుదలంచి యిది పూజనీయముగు ధ్రువమనియెంచి గౌరిపలుకు లాదరించి విఘ్నేశ్వరాయని యామంత్రించి॥ ౧౬౮॥

## ౧౩. శివుఁడు వినాయకునికి మంత్రోపదేశంబు చేయుట.

సీ॥ ఎద్దానిఁగమలజుం డేకాంతచిత్తుఁడై
జపియించిసృజియించె జగము నెల్ల।
నెద్దానినారదుం డెదలోనఁదలపోసి
విమలబ్రహ్మజ్ఞాన విధముదెలిసె।
నెయ్యదనుత్తమం బెయ్యదివేదవే
ద్యంబట్టినారాయ ణాష్టవర్ణ।
మంత్రరాజముశక్తి మాన్యాదిసకలాంగ
యుతముగానుపదేశ మొనరఁజేసి।
పుత్రదీనినిశ్చల చిత్తమునజపింపు।
నీయభీష్టంబు నేకురు నిక్కముగను।
నమ్ముమనినముదంబొంది నతులు నేసి।
చేనియెగజముఖుండాత్మీయ సదనమునకు॥ ౧౬౯॥

---

## ౧౪. కుమారస్వామి నదులలో స్నానము చేయుట కేగుట.

వ॥ అట సాయంతనంబగుడు సేనానికృత్యంబు నిర్వర్తించి భుజించి
శయ్యాగారంబుఁజేరి మృదుశయ్యంబరుండి కనుమూయు లేచు
మరలఁ గనువిచ్చియెపన్నుండు॥ ౧౭౦॥

సీ॥ లేచితారలఁజూచుఁ జూచిఱేయింకను
జాలనుండెనఁటంచు శయ్యఁజేరుఁ।
జేరిగ్రక్కునలేచి తారెనూకాలంబు
ఱిక్కఁజూచెదనంచుఁబక్కదిగును।
నరయుచోమేఘంబు లడ్డైనవాయవ్య
బాణమేనెదనని పరువులిడును।

గోపించినను గూడ దోపిన వ్రతముల
ఫలములసంసిద్ధిఁ బడయుఁ బురుషుఁ।
డంచుమది నెంచుమఱియు న త్యంతమంద।
గమనుఁడయ్యె నాభానుండు గదలలేఁడు।
బలిగృహమునఁ బద్మినాన్యా సవప్రపాన।
మదసమాగమము కతన మఱచెభూమి॥ ౧౭౧॥

వ॥ అని మఱియు॥

కం॥ ఊరువులు లేనిసారథి।
తేరికిఁ జక్రంబొకండె ద్విరసనులఁ ట్రా।
ళ్లారము భారంబెక్కుడు।
వారువమొక్కఁడెట్లు వడిగాఁ దిరుగున్॥ ౧౭౨॥

గీ॥ అనుచు వేళ గాకున్న నేనటుకుఁ బోవు।
నంతకౌనని నెమ్మిని నపుడ యెక్కి।
పోవుచో గూబ యొకఁడెవా పోయె వీచె।
గాలి ప్రతికూలమైయైనఁ గడఁకఁ జేనుచు॥ ౧౭౩॥

శా॥ క్రౌంచాద్రిం బగులించి తారకుని నే ఖండించి తిన్మించితిం। బ్రాంచ
త్సైన్యపతిత్వమున్ శకునము ల్భావింపఁగా నేలయీ। కొంచెం
వుంబని కంచచంచలతతోఁ గూలంక షస్తంగరో। మాంచంబుం జె
లఁగంగఁ గాంచిడిగుచో మాయూరమా యానమున్॥ ౧౭౪॥

గీ॥ జ్యోత్స్న వినిడిగనిప్పుడు జోముకంటె।
రాత్రియున్న దాయంచున్నఁ గ్రమతజలక।
మాడివార్చవలయున న్నిప్రోదినులన।
టంచుడిగ్గను గంగలో హంసతుండు॥ ౧౭౫॥

కం॥ సందేహించున కాలం।
బందుమునింగిన విఫలము లఖిలార్థములం।
చుందలఁచునిట్టులెంచియు।
నందుమునింగెను బ్రభుతకు నాసపెనంగన్॥ ౧౭౬

వ॥ ఇట్లుతండు గంగలోఁ బ్రుంగి కుఱంగటు నెవ్వరింగానక తల్లీ యిక్కడి కెవ్వరేని నీరాడవచ్చిరాయని భాగీరథినడుగ నొకపొట్టివాఁ డెలుకనెక్కి స్నాతుండైయదె పోవుచున్నాఁడని చెప్ప నివ్వెఱపడి నేనిక్కడనుండ నెవ్వరు రారైరి జాహ్నవి కల్లలాడెనె నాతల్లి యట్లేలచెప్పఁ జూడలేదేమొయనుచుఁ జింతింపుచు నచ్చోటువాసి యమునంజేరి స్నానంబాడి వచ్చుచు యమున నడిగిన గంగ యట్లపల్కఁదల యూచి యాతాయాత బ్రాహ్మణ జనంబులనడుగ వారు నట్లన సరస్వతికింజేని క్రుంకి యక్కడ నట్లకానొక యోగింగని యతండట్లచెప్పఁ దెలివితప్పి చేప్పనఁ దెప్పిఱి యేమి దైవమాయ నాకేల యీయాధిపత్యంబు రాదు కాకున్న లోకంబు చీకాకుపఱతు వేధంబట్టి బాధింతు బల్మినే కావించు కొనెదనంచు నతిప్రీతిఁ బ్రతితరంగిణికిం జని వలయు మంత్రంబులు చెప్పకయె మునుంగుఁ గొన్నిటఁ గేకితోఁ గూడ బ్రుంగు చేలియెచ్చిన వహ్నిఁ జేరఁబోవుఁ దామసించిన వేగునను. ఇట్టికష్టవ్రతంబూని యీఫలంబుగోరఁదగదను చేసినయత్నంబు చెడునను వినివినఁ జెడునను పోవుచో నెవ్వరోవచ్చి స్నానంబాడి నీళ్లు జాలుగా జోఱఁగా నేగిరను దూరమేగిన స్పష్టంబుగ క్షణక్షణ ప్రవర్ధమానా ప్రతిహత వైష్ణవ తేజోవిభాసిత శరీరుండై మూషకంబెక్కిన గజముఖుఁగాఁదలంచు దిశలాలోకించు. ఇట్టులలసిసాలసియు మానక మహింగల యెల్ల పుణ్యతీర్థంబులం గ్రుంకులిడుచుండె నక్కడ గజాననుండు॥ ౧౭౭।

కం॥ సారవుమంత్రముగైకొని।
నీరాడుటమానియధిక నిశ్చలభక్తి।
న్నారాయణనారాయణ।
నారాయణయనుచునుండె న్యస్తభరుండై॥ ౧౭౮॥

కం॥ *ఒకమాఱుపల్కినంతన।
సకలనదీస్నానసుకృత సఫలతగామా।
నకనిరతముజపియించిన।
నకలుషమతికింగలుగవె యఖిలార్థంబుల్ ౧౭౯॥

వ॥ అనినమునులు సూతుంబ్రశంసించి శ్రీమన్నారాయణునకు నమ
సక్రౌరించి యవలికథ నడుగ నతండిట్లనియె॥ ౧౮౦॥

ఉ॥ అంతగజాననుండు హృదయంబునఁబొంగి ప్రభాతమైనన। త్యంత
విభాసితాంగముల నద్భుతవైష్ణవ తేజమొప్పఁగా। నెంతయుభక్తి
తోజనని కీశునకున్నతిఁ జేసివత్సనీ। వింతట నుండి విఘ్నముల
కీశుఁడవైతని వారుపంపఁగన్॥ ౧౮౧॥

కం॥ శుభమగుననిపొంగుచుఁజేనె।
శుభశకునము లెడనెడఁగని సొంపొందుచున।
బ్జభవుని సభకున్విఘ్నే।
ప్రభుత్వవిభవాభిలాష బ్రబ్బికొనంగన్॥ ౧౮౨॥

గీ॥ ఏగియజుఁగాంచినతిఁజేసి యెల్లనదుల।
మునిఁగివచ్చితినిప్పించు ఘనవినాయ।
కత్వమనవినియద్దివ్య కాంతిఁజూచి।
విస్మయపడిదివ్య జ్ఞానవేదివేధ॥ ౧౮3॥

---

* "సకృన్నారాయణేత్యుక్త్వా" అను శ్లోకార్థ మిచటస్మరింపనగు.

కం॥ అనెనారాయిచ్చితినీ।
కనఘంబగునాపనియన నానందముతోఁ।
దనజపము చేయుచుండెను।
మునుపేగినతారకారి మురిపముతోడన్॥ ౧౮౪॥

గీ॥ నదులనన్నిఁటఁగ్రుంకి వినాయకత్వ।
మొందవిధిఁజూడఁజేనుతటి నల్లమెల్లఁ।
గలఁగెవామపార్శ్వాంగము ల్క్రుంపమొందె।
నైనమానకతత్ప్రభు త్వాశఁజేసి॥ ౧౮౫॥

గీ॥ నెమ్మిదొందఱవెట్టుచుఁదమ్మిదొరను।
దిట్టుచిప్పుడేయుదయించియట్టియెంత।
వేళయాయెనఁటంచునువిడకదుష్ట।
శకునములఁజూచిచేగెనుస్రష్టసభకు॥ ౧౮౬॥

కం॥ చేనివిధికిఁమ్రొక్కిచెంగటఁ।
దనరుననలసముగజముఖుధైర్యాచలునిం।
గనియనుకొనెనారయితఁడు।
ననుమొఱఁగిగయికొనునెకొవినాయకపదమున్॥ ౧౮౭॥

వ॥ అంతవిధికుమారుని నుచితాసనంబునఁగూర్చుండుమని॥ ౧౮౮॥

గీ॥ దీవనల్చేసిషణ్ముఖనీవుతాము।
సించితివిరాకనీకంటెశీఘ్రమరుగు।
డెంచెనితఁడుగావుననిచ్చితింజెఱువుల।
రాచటికమిందునకునాత్మఁగ్రాఁగకయ్య॥ ౧౮౯॥

కం॥ అనినంజేడ్పడితెప్పిటి।
జనకుఁడుగూర్చెదునతఁడనిజననియనూయం।

గనుననినమ్మిననాకీ।
జననియుఁదండ్రియొకఁడైరిచోలుంజోలున్॥ ౧౯౦॥

గర్భంబులోనున్నగంగలోఁబడఁద్రోసెఁ
  సైఁచేకయాయమ్మసరగనన్ను।
శరములోదిగఁద్రోచెఁగరుణస్వాహాదేవి
  పెంచేదేపాలిచ్చిపెక్కుగతుల।
ఊతిపుట్టినతల్లులాతల్లులకునేల
  నాయందుజనియించునాదరంబు।
నాతల్లులకుఁగామియైనగంబయ్యెను
  నాదలనెక్కించెనబ్బయకట।

యట్టివాఁడయ్యెబ్రహ్మ నేనాశ్రయింతు।
నన్నఁజెలికిదేహమెయిచ్చెనంబుజాక్షుఁ।
డక్కునిచ్చెనైననుబోదుననినఁదుదకు।
వారుమూరొక్కటౌదురుపలుకులేల॥ ౧౯౧॥

వ॥ మఱియు వినాయకుం గూర్చి॥ ౧౯౨॥

కం॥ ఏదేమంత్రమునేర్చెనొ।
లేదేశివమాయయొక్కొ లీలఁగనీలం।
బోదరుఁడానీరాడెనె।
మేదినిఁగలయన్నినదుల మెలపున వేగన్॥ ౧౯౩॥

కం॥ అనియిట్లుకుమారుఁడుతన।
మనమునఁజింతిలుచునుండె మహితవృషారో।
హణులయిసతిహరులరిగిరి।
వినాయకోత్సవముఁజూడ విధిపురమునకున్॥ ౧౯౪॥

కం॥ హరుఁడుకుమారుంగనియల।
సురలచమూనాయకత్వ శుభముంగనవే।
సరగన్ విడుతాపమ్మన।
విరక్తుఁడై సంతసించె విరసములేక౯॥ ౧౯౫॥

గీ॥ హరునియాజ్ఞ ప్తిఁ జెలువులదారనుఁజూడ।
నఖిలదేవతలేతెంచి యజునిఁబ్రోల।
సంకులంబుగ నిల్చిరిస్రష్టవారి।
నందఱనుగౌరవించెఁదా నర్హభంగి॥ ౧౯౬॥

వ॥ ఇట్లు సత్యలోకంబున గజముఖ విఘ్నేశ్వరత్వ మహోత్సవ కోలాహలంబు చెలంగుచుండఁ బశుపతి భాషాపతియను మతివై కుంఠుం బిల్చుటకు భృంగినంపిన వాఁడేగి విన్నవించుటయు॥

కం॥ లోకములఁబ్రోచుచుండెడు।
శ్రీకాంతుఁడుసిరినిఁగూడి చిలువలదినునా।
జోకగుగరుడిని నెక్కి-వి।
లోకనములకరుదు గఁద్రుదటిలోనటవచ్చె౯॥ ౧౯౭॥

## ౧౫. విఘ్నేశ్వరపట్టాభిషేకము.

వ॥ అంత నమ్మహావిష్ణుని బ్రహ్మదులెల్ల నెదుర్కొని వినయంబున మ్రొక్కి-రత్నమయోన్నతాసీనుంగావించి యర్ఘ్యపాద్యాదివివిధులంబూజించి వినుతించిరంత శివుండు నాపుణ్యవిశేషంబు వలన మీరాకకలిగెనసె. హరియును వారినందఱ యథోచిత సత్కారంబుల నాదరించి యుచితాసనంబుల మీద నుండని యమించి కొంతవడికి సుముహూర్తం బాసన్నంబయ్యె జోగు సేయవలదనియె. అప్ప డైరావతానీత శాత కుంభ కుంభ గత

మందాకిని చతుస్సముద్ర సర్వపుణ్యతీర్థ తీర్థంబుల దేవదుందుభులు మ్రోయనచ్చెరలాడఁ దుంబురు నారద గంధర్వులుపాడఁ జారణ గణంబులుస్తుతింప వాంశికవైణిక మంజులనినదంబులును, బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి సప్తర్షి దేవతాగురు దేవతాగురువేదోక్తాశీరవంబులును రోదసీనిండ, నింపుగ నిలింపులగుంపులు పూలవాన గురియింప స్థిరలగ్నంబున గ్రహంబులు బలోపేతంబులైయుండ, శ్రీనారాయణ పార్వతీ పరమేశ్వర శచీంద్రానలయమనైఋత వరుణ వాయు కుబేరేశాన వసురుద్రాదిత్య సాధ్యసిద్ధ యక్షరాక్షస విద్యాధర గరుడ గంధర్వ కిన్నరకింపురుష చారణోరగ పితృదేవాది సమస్త దేవతా పరిషత్సముఖంబున సత్యలోకంబున సరస్వతీ యుక్తుండై బ్రహ్మ గజాననుని సర్వవిఘ్న నాయకత్వంబున కభిషిక్తుం జేసె. శునాసీరుండు కల్పకతరు దత్తామూల్య భూషణ దుకూలాదులనుజారణాప్సరో గణంబులను, పార్వతి నవరత్నస్థాపిత సువర్ణమాలికను దేవతా విశ్వకర్మ ఛత్ర చామరంబులను శేషుండు చూడామణిని రమాదేవి యంగుళీయకంబును, సరస్వతి సర్వవిద్యానిలయంబను దండంబును, మఱియుఁ దక్కుంగలవారు కొన్ని వస్తువులఁ బిళ్లారికిచ్చిరి. ముత్యాల తలఁబ్రాలుచేల్లిరి దేవతాపురంధ్రులు మంగళారాత్రికలిడిరి. అంతవిష్ణుండు మహాదేవాదులంజూచి సకలదేవతలితనికిఁ దమతమ యంశంబొక్కొక్కటి యీయవలయునన వారట్లుచేసిరి. వాసుదేవుండుఁ దనకల యొకఁడిచ్చి యితండు సర్వదేవతా మయమూర్తిగావున నమర్త్యుండై పరదేవతయగు, నన వారెల్ల హరికృపకు సంతసించిరి. అంత విఘ్నేశ్వరుండు పట్టభద్రుండై జననీజనక శ్రీనారాయణ వాణీహిరణ్యగర్భ దేవేంద్రసప్తర్షి ముఖ్యులకు భక్తితోనమస్క

రించి యాశీర్వాదంబులంది ముదంబున నుండె. శివుండందఱ మందార కల్పితాహారంబులం దనివొందఁజేసి బహూకరించె. విష్ణుండు శూలిమొదలగువారి వీడ్కొని వీటికేగె. ఇంద్రాదిదేవత లాత్మావాసంబుల కేగిరి. సర్వజగంబుల విఘ్నేశ్వరమహోత్సవంబుఁ జాటుచుభూలోకంబున నిప్పుడు భాద్రపదశుద్ధచతుర్థి గావునఁ బ్రతివత్సరంబు నీదినంబునఁ బూజించునదిగాఁ జాటించుమని శివానుమతిభృంగితో బ్రహ్మపల్క నతండట్లు చేసె. శివుండు సపరివారంబుగ బ్రహ్మనువీడ్కొని కైలాసంబున కేగె. వినాయకుం డతి కుతుకంబునఁ బూజేలువొంద ధరణీతలంబున కేగె॥ ౧౯౯॥

సీ॥ తృణములుహస్తిబంధనమైనవడువున
నణువులుభూధరమైనయట్లు।
త్రుటులుగూడినవిబుధులయుగంబైనట్లు
బిందువుల్సింధువై వెలసినట్లు।
గిరిసుతోద్వర్తనకృతవిగ్రహముబ్రహ్మ
మైయొప్పెనఖిలామరాంశములను।
నొక్కొకయంశమేయొగిజగత్సర్గాదు
లనుజేయనఖిలకళలనుబొంది॥

దేవుఁడాటరుదేయంచుదివ్యసూక్తి।
మునులతోసూతుఁడిట్లనెననఘుఁడాగ।
జాన్యుఁడుతాహమునఁబోయియవనియందు।
మిగులమనుజులపూజలమెలఁగుచుండె॥ ౨౦౦॥

వ॥ అనిన నవ్వలికథఁజెప్పుమనుటయు॥ ౨౦౧॥

చ॥ ఉదితసహస్రకోటితపనోజ్జ్వల సూర్యధిపాపరాంబరా।
స్వదధృతపద్మ షడ్గుణ విశాలప్రసన్న సురూపభూరమా
దిదయిత సేవితాసతత దివ్యపరంపదవాసవాసవా।
దిదివిషదాళ్యగోచర సుదీధితి శేషశయాన కేశవా॥ ౧౦౨॥

మాలిని॥ సురుచిరగుణజాలా సుందరీబృందలోలా।
సరసిజదళనేత్రా చారుసత్యాకళత్రా।
సురవరగణవంద్యా సూర్యపుత్రాభినంద్యా।
కరధృతఘనచక్రా ఖండితారాతిచక్రా॥ ౧౦౩॥

శ్రీశ్యమంతకోపాఖ్యానము

పూర్వభాగము

సంపూర్ణము.

శ్రీరస్తు.

# శ్రీ శ్యమంతకోపాఖ్యానము.

---

## ఉత్తరభాగము.

కం॥ శ్రీవాసుదేవ కేశవ।
శ్రీవత్సాంకిత శ్రితజన చింతామణిరా।
జీవదళాక్ష రమాధవ।
దేవాధిపవందితాంఘ్రి తేజోమూర్తీ॥ ౧॥

గీ॥ నైమిశారణ్యమందున నఘులు శౌన।
కాదిమునులు సూతునిఁ జూచి యాగజాస్యుఁ।
డట్లు భూమిఁ బూజలనొందియంత యేమి।
చేసెఁ బౌరాణికోత్తమ చెప్పఁగదవె॥ ౨॥

వ॥ అనిన మునులం జూచి సూతుండిట్లనియె. ఇట్లు గజముఖుండు పుడమిజనులు చేయు సర్వోపచారంబులం బరితృప్తుండై॥ ౩॥

కం॥ తాఁ బిండిబొమ్మయగుటం।
గాఁ బోలును మోదకములు కడుఁ బ్రియములు నా।
గా బొజ్జనిండ మెక్కిఁ బ।
శీబాగనిపజేవాగడఁగలీలంబురికిన్॥ ౪॥

---

## ౧. విఘ్నేశ్వరుఁడు కైలాసమున కేగుట.

వ॥ పోవసమకట్టి కొన్ని మోదకంబులు వస్త్రంబులఁ గట్టి మూపున వైచికొని కొన్ని మూటగట్టి మూషకంబు పైనిడి కొన్ని చేతఁబట్టుకొని మిగిలినవి విడువఁ జోలక జనులిచ్చిన వలువలు సొమ్ములు పాఅవై చిత్రిశూలాద్యాయుధములు వీడి మోచికొని పోయెదనను.

అట్లయిన నాయుధములకుఁ దండ్రియు వస్త్రాంబరాదులకుఁ దల్లియు నల్లుదురు. అనియెంచి విరక్తుండయ్యు మరలఁ గొన్ని కుడుములందికొని కొన్ని యుండ్రంబులు భక్షించుచుఁ దేజికిఁ బెట్టుచుఁ బొట్టవిచ్చునట్లు తించు నెడనెడ విశ్రమించుచు వెక్కసంబుగ మెక్కిన తత్తడి నడువలేకున్నఁ గొట్టుచు నదియఱచిన నవ్వుచు నెట్టకేలకుఁ గడుపీడ్చికొంచుఁ గైలాసంబుఁ జేరి వాహనంబుడిగ్గి తనరాకకెదురు సూచుచున్న తలిదండ్రులకు నమస్కరించుచో నాపిల్లారిలం బోదరంబు భూమిపై మోని పాదంబులు శిరంబుఁ దేలిపోయె, నిట్లు తలిదండ్రులకు సాష్టాంగప్రణామంబుఁ జేయుటకుఁ గృతశ్రముండగుచున్న నాగుజ్జునుగ్ర శిరోమణియగు రాహో చూచి పక్కన నగియె, గ్రక్కున వినాయకుని పొట్టపగిలి యుండ్రంబులు వెలుపలంబడి కొన్ని ప్రమథగణ పరివేష్టితుండైన ఖండపరశువుం గప్పె. కొన్ని ప్రోవులైపడి రెండవ వెండికొండ వడువు ననుండె. కొన్ని కైలాస నగరపరిఖంబడి పాతాళవాసులకుఁ గొన్ని యూర్ధ్వంబున కెగసి దివిజులకుఁ గొన్ని పార్శ్వంబులం బడి మనుజులకు నీసుద్దిచెప్పె కొన్ని కైలాస పత్తనని కేతనంబుల పయింబడె. ఇదికారణంబుగ నాటంగోలెఁ బ్రతివర్షంబుం బట్టణంబులం బల్లెలనూళుల జనంబులుం డ్రంబులిండ్లపై వేసికొండ్రు. అవిలేనివాండ్రు రాలు వైచికొండ్రు. అని సూతుం డిట్లనియె. తనపైఁ బడ్డ మోదుకంబులు చండికద్రోచికొని చేష్టలుదక్కిపడియున్న కొడుకుం జూచి యిట్లని విలపించె॥ ౫॥

ఉ॥ చిన్నికుమారచూడరవచింపర యింపగుపల్కు నీముఖం।
బన్నకనంగఁ గోరెదను దారగణాధిపతిత్వసంపదల్।
గ్రన్ననఁ దెల్పుముండ్రములు గ్రక్కనఁ దేజికిఁ బెట్టురమ్ము నా।
యన్న యిదేలపంతమొకొ యాలమొ రజ్జులా నీకుఁ దల్లిపై॥ ౬॥

ఉ॥ దినదినగండమయ్యెనతిదీనుని మాడ్కి ధరాపరాగము
ల్మనమునఁగప్పఁగాఁబడితి ముద్దులబిడ్డఁడతండ్రిచెంపని
స్గనివెస రాక్షసోత్తమునిఖండ శిరంబునొసంగనిప్పుడీ
ఘనతర రాజదృష్టిఁబడిక్రాఁ గితివక్కటయేదిదిక్కురా॥ ౭ ॥

గీ॥ అనుచుడగ్గఱగాఁజేరియంగమంటి
కటకటాయెట్టి పాపంబుగడఁగిచేసి
యుంటినోనన్నుఁగనవుముక్కంటిఁజూడ
వెందుఁజొత్తు నేమందు నేమందుఁదెత్తు॥ ౮ ॥

కం॥ ఒక్కనిమేషంజేనియుఁ
జేక్కనినీరీవిఁజూడఁజాలఁగనయితిం
గ్రక్కుననీనీచునిఁదల
నెక్కించిననింతవచ్చెనీశివుకతనన్॥ ౯ ॥

వ॥ అనుచు నిలకవెల్లువలై వచ్చు బాష్పజలంబులఁ జేలాంచలంబున
నొత్తుచుఁ దడబడనడుగిడుచు డగ్గుత్తికవెట్టుచుఁ దేరిచెట్టవట్టి
న చెలికత్తెలనొ సరించుచు ధూర్జటింజూచి సకల దోషాకరుఁ
డై గురుతారా సంగమవిశిష్టుండై యున్న యిప్పాండు మయూ
ఖునవుదల నెక్కించికొన్న గర్వంబియింతలు పుట్టించెననిశోకం
బువదలి క్రోధంబురూపుదాల్చి వచ్చెనాఁగటముల దరరదంబు
లుపటుపటం గీఁటింపుచుఁ గనులనిప్పులు రలఁజంద్రుంజూచి॥

## ౨. చంద్రునికి బార్వతి శాపమిచ్చుట.

కం॥ ఇది మొదలెవ్వఁడునిన్నుం
బదపడిచూచిన సతతముఁ బ్రాకటనిందా
స్పదుఁడై యుండెడుమని వే
వదలక శాపంబునిచ్చెఁబరుషతరోక్తిన్॥ ౧౦ ॥

వ॥ ఇట్లుశాపంబిచ్చి పార్వతిమరలనుతు నింగని॥ ౧౨॥

ఉ॥ ఏటికివచ్చెనీప్రభుత యేటికిమ్రొక్కెనుమ్రొక్కఁబోనితం
డేటికినవ్వెనవ్వినన దేటికిగ్రద్దనఁబొట్టవిచ్చెనే
ప్పాటఁదొలంగునీయిడుమ పట్టిసుఖించుటయెట్లొయంచుఁజే
డ్పాటుననాథుఁజేరినఁదటాలుననాతఁడుడాసియంతటన్॥ ౧౩॥

గీ॥ ఉత్తరీయమునను మోమునొత్తితాళ
వృంతమునవీచియూరార్చి కాంతయిపుడ
యశ్వనీదేవతలఁబిల్వనంపివారి
చేతవైద్యంబుఁజేయింతుఁజింతవిడువు॥ ౧౪॥

వ॥ అనునంతలోనచేటుచేటఁ దిరుగుచు నాసత్యులక్కడికి వచ్చి
సాంబునకుమ్రొక్కి విఘ్నేశ్వరుంజూచి ౧౫॥

గీ॥ తావులేనిమిదిదగుపరీక్షావిధమునఁ
జూచియాతఁడుజీవించుఁదోచెవెట్టి
దోసములుమీరువగకుఁడితొలగుమాచి
కిత్సనీబాధయనివెండిగిరిశుతోడ॥ ౧౬॥

గీ॥ చంద్రఖండముల్నాగముల్ శాతసూచి
వజ్రమయశలాకయుసుధవలయునన్న
వల్లెయనినవ్వేఁబురవైరివంతఁజెందె
నిందుఁడునుమహానాగముల్వొందెభీతి॥ ౧౭॥

వ॥ అంత భవానిహర్షించె నంతకుమున్నె వెన్నెలఱేఁడు విన్ననై
మింటిసిగవాని యాందలవలనడిగివచ్చి రక్షింపుమని గౌరియ
డుగులపైఁ బడియుండె. శివుండు భృంగింబిలిచి పాతాళంబున
కేగి శేషున కీవృత్తాంతంబుచెప్పి నాగంబులఁ బదివేయింటినిఁ
దెమ్మనియుభైరవుంజూచి స్వర్గంబునకరిగి వజ్రికిక్కడఁజెప్పి
సుధాదివస్తువులఁదెమ్మనియుఁబంచె॥ ౧౮॥

కం॥ అంతటభృంగిచేనియెమునిని।
తాంతత్వరసుతలమునకునచేటునసంతుణ్।
శాంతుంగనిగణనాథును।
దంతంబంతయువచించెనందఱువినఁగణ్॥ ౧౯॥

## 3. పాతాళంబున నాగంబులుభయపడుట.

వ॥ అంతనీయుదంతంబు బలిసద్మంబంతట నెరయవిని మహానాగంబులు నిశ్చేష్టులై పడువారును బరువులిడువారును బాఱువారును వెలవెలఁబాఱువారును వారిజాసనుందూఱువారును నీరంబుల నీరంబులఁదూఱువారును బుట్టలం జొరఁబాఱువారును సర్వలోకంబులకన్న నీభోగిలోకంబెభోగలోకంబనునుడి వ్యర్థమయ్యెననువారును జూడామణులులేకున్న మహానాగంబులుగావనివిడుచునని శిరోరత్నంబుల డాచువారును నిట్టియిక్కట్టుల పుట్టుగుగొప్పకాలంబునఁ బుట్టుటకంటె హీనజాతింబుట్టి దరిద్రులమైనఁ గొంతకాలంబు బ్రతికియుందుమనువారును, బుత్రమిత్రధనధాన్యముఖరసుఖమ్ము లనుభవింపకమున్నె యపమృత్యువు వచ్చెననువారును జిరజీవు లీచిరజీవులనువనజయోని వచనంబు మోఘంబయ్యెననువారును, మమువదలినమణిమంత్రౌషధములిచ్చెదమనువారును, సర్వధనంబులిచ్చెదమనువారును, గష్టములెన్నింటికైన నోర్వవచ్చుఁ జావున కోర్వఁజాలమనువారును, జనమేజయసర్పయాగ పర్యంతంబుందుమనికొంటి మనువారును, నెప్పటికైననిమిత్తితప్ప దిప్పుడిట్లుచేయుట పున్నెమనువారును, బాపీచిరాయువనికలదు. అట్టినిందంబొంది బ్రతుకుటకంటెఁ గ్రొత్తక్రొత్తగ విఘ్నప్రభుత్వంబున కభిషిక్తుండైన లంబోదరునిబ్రదికించుట మంచిదనువారును గళత్రపుత్రబంధుజనంబులయెడవిరక్తులై వారికిధర్మోపదేశంబుచేయువారును బ్రతిదిన

గండంబులకంటె నెక్కుడేపసమసిన లగ్గునసువారునై యున్నఁ బాతాళమతివేల కోలాహలంబుతో నిండియుండె॥ ౨౦

మ॥ మురదాహారులమైయగోచరులమైమాత్సర్యముందూలిని।
ర్భరవృత్తిందగనుండుమాకునకటాభావింపదిక్కేదియు।
ద్దురవస్థందొలఁగించుటెట్లొకొకడుందుష్టాత్ముఁడిందుండుదాఁ।
బరిహాసించెనదేలవిచ్చెఁగడుపాపాపాత్ములౌవైద్యులన్॥ ౨౧

శా॥ నాగంబుల్పదివేలుగావలయు దానంజేసినీరోగియౌ।
నీకుజ్జించువచించిరేలయకటాయీశేషుఁడాశార్ఙ్గిశ।
య్యాగారాసనరూపకమ్ములనయత్యాసక్తితోనిత్యమున్।
దాఁగొల్వన్ ఫలియించెనియ్యదిగదానానాటికింకేమొకో॥ ౨౨

ఉ॥ కొందఱుశంభుభూషలఁటగొందఱుసూర్యరథంబురజ్జువుల్।
గొందఱుభూమివాహకులుగొందఱుతార్క్ష్యునిభోజ్యముల్ బళీ।
కొందఱువిఘ్నరాజునకుఁగుట్టులుకొందఱుభావియాగము।
న్మ్రిందుదురందఱిట్లయిననాగులకెంకిశివానివాసమా॥ ౨౩

కం॥ చక్రులువలయునఁటంచును।
వాక్రుచ్చిరివైద్యులంతవచ్చెనువీఁడీ।
లోకముగతానుగతికో।
లోకోయనుక్రియనరయరులోభుత్తగవుల్॥ ౨౪

వ॥ అనుచు నాగంబులుల్లంబునఁ దల్లడిల్లుచుండం భుజంగపుంగవుం గనిభృంగి దేవా మసలవలదు వలరాచేగొంగశాసనంబనుల్లంఘ్యంబు సర్పంబులరప్పింపుమనుడు శేషుండుమంత్రింజూచి యిట్లనియె॥ ౨౫

సీ॥ సప్తాంగయుక్తిచేసకలరాష్ట్రంబులఁ
బాలింపఁగాఁదగుఁబరివృఢుండు।
అన్యాయవృత్తిమైనఖిలాఘముల్వొందుఁ
బుణ్యంబులెడలునుబొందునరక।
మరిహితోదాసీనులగువారిఁదెలిసి
యేర్పాటుతోడఁజతురుపాయములను।
సప్రమత్తతనుండియరయుచుండవలయు
మనువునిత్యముగాదుమనకుఁజెలియుఁ।
ప్రభువుసమ్మాన్యుఁడగునీకువాంఛితంబు।
వలయుసలుపదానయశంబుగలుగుశాశ్వ।
తంబుగానుండుఁబుణ్యంబుదశసహస్ర।
సంఖ్యనాగులరప్పించుసరగనిటకు॥ ౨౬॥

వ॥ అనినసమ్మంత్రి పదివేలనాగంబులరప్పించె. వారును లోఁదీం
ద్రించువెతచేఁ దడవులనిడుపలయొడ యనికివలగొని నెలవుగొని
కైలాసగమనోన్ముఖులై రయ్యెడఁ దండుండుకుండలి ప్రకాండు
నకుం దండంబు వెట్టివీడ్కొని నాగులరండురండు మృడుండు
చెండుఁదామసించిన ననఁజచ్చెడు మాకింకజంకేమి యనువా
రును, వెనువెనుకఁజూచువారును, దైన్యంబున నేడ్చు సతీసుత
సోదరాదులతోడఁగూడి యేడుచువారునునై పురంబుబహుదూ
రంబువఱకుఁ దడబడనడుగులిడుచు వెనువెనక్కఁజూచుచుఁ
బ్రాణంబులవలన నిరాశంబొంది వైరాగ్యంబాదిభృంగితోఁ
బోవుచుండిరక్కడ॥ ౨౭॥

కం॥ అమరావతికాఖైరవుఁ।
డమరంగానేగితనదునాగమనంబా।
యమరేశునకున్దద్ద్వా।
రముకాపరిచేఁదెలిపిసరగననుమతుఁడై॥ ౨౮॥

సీ॥ ఆమోదమునఁజొచ్చియామోదముల్గల
కల్పప్రసూనసంఘటితహార।
భూషాభిశోభితయోషాళిలాస్యము
ల్గనుచుదిక్పాలకకథితలోక।
వార్తలువించుగీష్పతివచియించెడు
నీతులాలింపుచునత్రిముఖ్య।
సప్తర్షులాడెడుశాస్త్రపద్ధతికెంతో
యలరుచుశచికిష్టమగువినోద।
ములనుజూపుచుండెడుజిష్ణువెలయఁజూచి।
యతనియాజ్ఞబంగరుపీటయందుఁగూరు।
చుండితనరాకకుఁగతమునెఱిఁగినంతఁ।
జెప్పటయుఁబురుహూతుఁడచ్చెరువునొంది॥

వ॥ కొలువుగలయవిలోకించి వింటిరేకలువలచెలి యెంతవాఁడయ్యె
ననవాఁడు ప్రకృతియందె వక్రుఁడనువారును గురుదారంగూడి
నవానికి దెంతనువారును నిట్టిశాపంబు లెన్నో మున్నె యున్నవ
నువారును దోషాకరుండనువారును, దుష్టులశిరమెక్కించిన నెం
తలుపుట్టవనువారునునై యానిస్వానమాస్థానమంతట నిండెనం
త నింద్రుండదివారించి యమృతరక్షకులంబిల్పించి యొక్కసు
ధాపూర్ణకలశంబుదెప్పించి విశ్వకర్మనురప్పించి వీనిఁదీసికొని
వేగంబకైలాసంబునకేగుమని భైరవునివీడ్కొలిపె॥ 30॥

కం॥ వీరలుచేరెడునంతకు।
దారులనాగులఁగొనిహరుననుచరుఁడుగ్రపా।
వారాశిసదాశివునిం।
జేరెనుహరశైలజలకుఁజిత్తములలరన్॥

## ౮. అశ్వినీదేవతలు వినాయకునికి వైద్యము చేయుట.

వ॥ భృంగియు మహానాగంబులు భైరవుండు విశ్వకర్మయుఁ నుమా
మహేశ్వరులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగ నమస్కరించి యుచి
తాసనంబులఁ గూర్చుండిరి, దేవవైద్యులు చెప్పినట్లు సూచియు
వజ్రశలాకయు విశ్వకర్మ చేసియిచ్చె. వృషభంబమృతకలశంబు
నిచ్చె, భృంగి పచ్చకర్పూరంబు సమర్పించె. అంత నాసత్యులు
విఘ్నేశ్వరు నొక్క మృదుశయ్యం జేర్పించి యిలపైఁ బడ్డమో
దుకంబులు గర్భంబున నించి నాగంబులఁ గొన్నిటి మగరాలస
లాకచే వ్రచ్చి సూచిం గ్రుచ్చి సుధామిళితకర్పూర ఖండంబు
లతోఁ దమ తెచ్చిన సంధానకరణి విశల్యకరణి సంజీవకరణ్యాది
దివ్యౌషధీమిళితౌషధంబు గూర్చి యుదరంబున వెకి కూర్చి పైఁ బై
నమృతంబుఁ జల్లుచు లంబోదరుని ర్వ్రణోదరుఁ జేసి రతం డల్ల
నఁ దేరి లేచి యిదేమని తల్లి నడుగ జరగిన దంతఁ జెప్పి శిరంబు
మూర్కొని ముద్దాడి మేను నిమిరియుమితోల్లాసినియై యశ్వినీదేవ
తలం జూచి మీకతన నాకొమరుండు జీవించె మీకుఁ బ్రత్యుపకృతి
చేయఁ జాలనని యమూల్యాభరణాదులుఁ గుడుములొసంగి
యంపి విశ్వకర్మకు బహుమతి యిచ్చి యుంద్రంబులు కొన్ని యి
చ్చి పంపి, భృంగికి భైరవునకుఁ గుడుములు వలయునన్ని యిచ్చి
సుఖంబుండె॥ ౩౨॥

గీ॥ పిదప హరుఁడు భార్య వీక్షించి కటకటా।
జగమునకుపకారి శశికి శాప।
మిచ్చితబల లెంత లేని సాహసముల।
కైనఁ జొత్తురరయ రరయ రెందు॥

వ॥ అనుచు విధుని లేవనెత్తి యితనిఁ జూడక యే దినంబున నేరికి జరగు
శాపంబు గ్రమ్మఱుపుమన నార్య చిఱునవ్వు నవ్వి క్రొవ్విన మిత

లపుచ్చునెత్వ మీకు నెవ్వగగలిగెనా. నావచనంబమోఘంబు. అ
యిన శంకరానిన్నుఁజేరినవారు చెడరుగదా శాంతింబూనికొం
తవారింతుననియె నంత॥ ౩౪॥

దం॥ శ్రీపార్వతీపూర్వ గీర్వాణగర్వంబు సర్వంబునాశంబు నొందిం
చుచున్నించుతేజంబు రాజిల్లఁద్రై లోక్య సృష్ట్యాదులం జేసి
త్రైగుణ్యముల్లేక యుంగల్గుచుందద్గుణాళిం బ్రజాళింబ్రపోషించు
చున్ సర్వశక్త్యాత్మవై సర్వమంత్రాత్మవై సర్వతంత్రాత్మవై
సర్వయంత్రాత్మవై బ్రాహ్మివారాహిచాముండి హ్రీదేవిశ్రీదేవి
మాయాత్మదుర్గాది నామంబులం జెల్లుచు న్మార్తులస్మావురన్మిం
చి సంతానముంబోని సత్పంతతింగాంచు చేత్యంత నిష్ఠాగరిష్ఠా
త్ములౌ నావసిష్ఠాదిమౌనీశ్వరశ్రేష్ఠు లెల్లప్పు డుల్లంబులంగొల్ల
గాఁగొల్వ రక్షించుమాతల్లివార్తాదు లాసిద్ధివిన్నీవనీవేగదా యె
ల్లవిద్యాదులున్ శాస్త్రముల్లోకమాతా నినుంగొల్చువారెందులం
గుందిరేశాపమేనొందఁ జౌలన్ గృపాబ్ధీమహాసంపద ల్వేగనాకి
చ్చి శాపంబుమాయించిరక్షింపవే తల్లిరక్షింపుమోకాళి నీబి
డ్డఁడం దాసుఁడన్ని నన్ను నేనమ్మి నిన్నెమ్మదిన్నెమ్మితో నిమ్ము
గానిమ్ము గానిమ్ము మమ్మా నమస్తేనమస్తే పునస్తేనమః॥ ౩౫॥

వ॥ ఇట్లుసోముండు సర్వమంగళంబొగడుచుండ॥ ౩౬॥

మ॥ సురనాథాదిదిగీశ్వరామరముని స్తోమంబుదన్గొల్వశ్రీ।
గిరిజంబ్రోడఁగబ్రహ్మ వచ్చె నతనిం గీర్వాణభర్త్రాదులన్।
హరుఁడర్ఘ్యాసనముల్దగంగనిడి ముఖ్యార్చల్ వెసం జేసిమీ।
రరుదేఁగార్యముఁదెల్పుఁడీయనుడున య్యబ్జాసనుండిట్లనున్॥

కం॥ దేవా సర్వజ్ఞుండవు।
నీవెఱుఁగని దేమిగలదునికష్టంబైన౦।

దేవిశశాంకునిపైఁగో।
పావేశంబునశపించెనని సేవింటిన్॥ ౩౯॥

వ॥ కావున దేవిని సేవించి లోకోపకారుండయిన యితనికి శాపంబుదగదనివిన్నవించి ప్రసన్నఁజేయవచ్చితినని కాత్యాయనింగని యమ్మ త్రిమూర్తులయంశంబున నత్రికినిందుండును, దత్తాత్రేయుండును, దుర్వాసుండునుగల్గిరి. ఈజైవాతృకులోకయాత్రకుసృజియించితి. తపంబున నన్ను మెప్పించి వరంబులు వడసె. విశేషించిమదంశోద్భవుండు నిశాకరుండు గావున నాకైయిద్దురాత్ముఁగావుము. ఆశ్రితదోషంబులడఁప నీకునైజంబు. అనిననుమసంతసిల్లి యిదిమొదలుప్రతిపూర్ణిమయందుఁ జంద్రుఁజూచిన నపవాదంబులువచ్చునని యె. అంతబ్రహ్మాదులానందించి పార్వతీపరమేశ్వరులవీడ్కొని నిజనివాసంబుల కరిగిరి. చంద్రుండు భర్గునిశిరసెక్కె. మఱియుఁ గొంతకాలంబునకు॥

## ౫. మునిభార్యల వృత్తాంతము.

ఉ॥ పున్నమనోము నోముచుఁ బ్రపుణ్యులుమానులభార్యలేద్వురుం
డిన్నని చంద్రుఁజూచినముని ప్రవరాంగనలగ్నికిం గుహు।
న్జైన్నుగఁగాంచి రంచు నొక నిందజనించె మహర్షివర్యులా।
యన్నువలన్ డిగన్విడిచిరారయకజ్ఞులకై వడినిష్కళంకలన్॥

వ॥ అంత నాపూఁబోఁడులుగూడి యే మేడనీటిచూలి యేడ మహాసేనుగాను పెక్కుడ. ఇవియేటిమాటలు వృథాపవాదంబుగలిగెనని మఱియు॥ ౪౧॥

గీ॥ సతులడిగ నాడిరో పతివ్రతలమమ్ము।
మీఁదరయక సప్తర్షులు వేదవిదులు।
గనరు దివ్యవిజ్ఞానమున ననసూర్తె।
యిందుఁగూరిచి యిట్లనెన దుఁగుంది॥ ౪౨॥

సీ॥ దోషాకరుఁడుక్షయిదుష్టుఁడుగురుతార
సంగమసంజాతసమ్మదుండు।
చక్రభేదిప్రకృతివక్రశరీరుఁడు
సాధ్వీకళంకియసత్పథమున।
వర్తించువాఁడునుభానిల్లుమిత్రవి
వర్తియందెక్కుడుభామవినవె।
యుగ్రచూడామణియొకఁడైనఁగలదెమం
చిగుణమునాఁగనాచెలికినసిరి।
తోడిసతులతనినినేలనాడరండు।
పోదముమయొద్దకంచేగిమోదమునను।
మ్రొక్కి-వినుతింపనార్యయోముగుదలార।
మెచ్చితినడుగుఁడిష్టమామేటివరము॥ ౪౩॥

వ॥ అనినవారలు తమవచ్చినవృత్తాంతంబునివేదింప గౌరివినియిట్లు నియె అతివలారలోకోపకారకంబై యిట్టినిందగలిగెఁ, గావున మీరునగవంబనిలేదు. అరుంధతిని వసిష్ఠుండువిడువఁడు. తక్కి-నమీరలార్వురకుఁ గుమారుండు జనించెనన్నకారణంబునఁ గృత్తికలైవియత్పథంబుననిల్చి ప్రతివర్షంబుభూప్రజలుచేయు నుపచారంబులంబరితృప్తింబొదలుచుఁ గోరికలిచ్చుచుండునది. మఱియును॥ ౪౪॥

కం॥ ముద్దియలారవినుఁడుసం।
బద్ధమునాపల్కు-భాద్రపదమాసమునన్।
శుద్ధచతుర్థినిశాకరు।
నిద్ధరితునిఁజూడజనులకెగ్గులువచ్చున్॥ ౪౫॥

వ॥ అనినంబార్వతివీడ్కొని ఋషిభార్యలేగిరి. మునీంద్రులారా యిదియెచండికచంద్రునికినిచ్చినశాపవృత్తాంతంబు. కృష్ణుండు

మృగాంకునిభాద్రపద శుద్ధచతుర్థియందున్ క్షీరపాత్రంబునఁ జూచెఁగాన శమంతకరత్నంబుహరించెనను నిందవచ్చె. ఆవలి కథవినుండు. శౌరియాదవవృద్ధులచే నీమాటవిని॥ ౪౬॥

## ౬. కృష్ణుండు శమంతకంబు వెదకుట.

కం॥ మితపరివారముతోఁజేని।
హితప్రసేనాశ్వహరులనరయుచునటపైఁ।
జతురుండడుగులజోడల।
క్షితిధరగుహడాసియంత సేనలనెల్లన్॥ ౪౭॥

వ॥ గుహాముఖంబునవిడిచి సాహసంబున మహానుభావుండైన హరి నిరంతరనీరంధ్ర నిబిడాంధకారబంధురంబై భయంకరంబై విశాలంబైన గుహాంతరాళంబుసొచ్చి॥ ౪౮॥

సీ॥ తనదేహకాంతులుత్తప్తజాంబూనదా
భరణరోచులుమణిప్రభలుగూడి।
కేళికాకందుకీకృతశమంతకరత్న
దీప్తులుగుహయెల్లఁదేజరిల్ల।
హంసతూలికతల్పమందుండిముదమున
దాదిలాలింపంగఁదనరుదాని।
జాంబవంతునికూఁతుజాంబవతీకన్యఁ
దొట్లెలోఁగట్టినయట్టిమణినిఁ।
జూచియాకన్నెసౌందర్యశోభలకును।
మెచ్చియాశమంతకమణిమ్రుచ్చిలంగ।
మెల్లననడుగులిడిడాయమెలఁతదాది।
మొఱలువెట్టెనాధ్వనిదరిమ్రోల్లమయ్యె॥ ౪౯॥

వ॥ అదివిని బలవంతుండయిన జాంబవంతుండువచ్చి తనస్వామి
యని కృష్ణునెఱుంగక ప్రాకృతపురుషుండనితలంచి కృష్ణునితో
రణంబుచేసెనందు॥

ం॥ పలలములకుఁబోరెడుడే।
గలక్రియశస్త్రములఁదరులఁగరములవిజయే।
చ్ఛలనిరువదియెనిమిదిదిన।
ములువోరిరినగచరేంద్రముఖ్యుఁడుహరియున్॥ ౫౧॥

కం॥ అడిదములుదరులువిఱిగిన।
బెడిదములగుమగతనములఁబిఱుతివకవడిం।
బిడుగులవడువునఁబడియెడి।
పిడికిటఁబోడుచుటలఁగలనబెరసిరిరువుటన్॥ ౫౨॥

శా॥ స్పష్టాహంకృతులుల్లసిల్లహరియుఀభల్లూకలోకేశుఁడు।
న్నష్టాముష్టినహర్నిశంబుజయసమ్మోహంబులంబోరుచోఁ।
బుష్టింబానిముకుందముష్టిహతులంబూర్ణశ్రమోపేతుఁడై।
పిష్టాంసోరుశరీరుఁడైయతఁడుదాభీతాత్ముఁడైయిట్లనెన్॥ ౫౩॥

వ॥ దేవా నిన్నుఁబురాణపురుషున కధీశ్వరుండైన విష్ణుంబ్రభవిష్ణుం
గా నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్య బలం
బులు-నీవ విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వరాచరింతు రట్టి
వారికి సర్గస్థితిలయంబులుచేయు నీశ్వరుండవీవ. ఆత్మకుంబర
మాత్మవునీవ మఱియు॥ ౫౪॥

॥ మత్స్యకూర్మసూకరనృసింహవటుపరశు।
రామరఘురామబలరామరమ్యకృష్ణ।
బౌద్ధకల్క్యాద్యనేకరూపములఁదాల్చు।
నాదినారాయణునినిన్నునాశ్రయింతు॥ ౫౫॥

గీ॥ వసుధ దానమ్ము మిషఁ జేసి బలి మొఱంగి।
హరికిఁదై త్రైలోక్యసామ్రాజ్యమల్ల నాఁడు।
సురల నొసఁగిన త్రివిక్రమ ప్రవిమల।
మూర్తి వటురూప నీకు నే మ్రొక్కులిడుదు॥ ౫౬॥

సీ॥ బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి
నింకించి బంధించి యేపుమాపెఁ।
బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే
దానవగర్వాంధతమసమణఁచెఁ।
గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు
దశకంఠు కంఠబృందములు ద్రుంచె।
నాచంద్రసూర్యమై యమరు లంకారాజ్య
మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె।
నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ।
డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వఁ।
డాతఁడవు నీవె కావె మహాత్మ నేఁడు।
మాఱువడి యెగ్గుఁ జేసితి మఱువవలయు॥ ౫౭॥

వ॥ అని యిట్లు పరమభక్తుండయిన జాంబవంతుండు వినుతించిన నతని శరీర నిగ్రహనివారణార్థముగా భక్తవత్సలుండైన హరి తనకరంబున నతని దేహంబు నిమిరి మేఘగంభీరభాషణంబుల నిట్లనియె॥ ౫౮॥

కం॥ ఈమణి మాచేఁబడెనని।
తామసులానరించు నిందతప్పెడుకొఱకై।
నీమందిరమగు బిలమున।
కేమరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే॥ ౫౯॥

వ॥ అనిన విని సంతసించి జాంబవంతుండు మణియును జాంబవతియు
ను తనకూఁతునుదెచ్చి హరికిఁ గానుకఁగా సమర్పించె, నఁట
మున్ను హరివెంట వచ్చినవారలు బిలంబువాకిటఁ బండ్రెండు
దినంబులు హరిరాక కెదురుసూచి వేసరి వగచి పురంబునకుఁ
జేనిరంత, దేవకీవసుదేవులు రుక్మిణియును మిత్రబంధు జ్ఞాతి
జనులునుగుహసొచ్చి కృష్ణుండు రాఁడు చిక్కెనని శోకించి॥౬౦॥

కం॥ దుర్గమమగుబిలమునహరి।
నిర్గతుఁడై చేరవలయునేడని పౌరుల్।
వర్గములై సేవించిరి।
దుర్గంగృతకుశలమార్గతోషితభర్గన్॥ ౬౧॥

కం॥ డోలాయితమానసులై।
జాలింబడిజనులుగొలువఁజండికపలికెన్।
బాలామణితో మణితో।
హేలాగతివచ్చునంబుజేక్షణుఁడంచున్॥ ౬౨॥

కం॥ యత్నముసఫలంబైనస।
పత్నసమూహములుబెగడఁబద్మాక్షుండా।
రత్నముతోఁగన్యాజన।
రత్నముతోఁబురికివచ్చెరయముననంతన్॥ ౬౩॥

కం॥ మృతుఁడైనవాఁడుపునరా।
గతుఁడైనక్రియయందలంచికన్యామణిసం।
యుతుఁడైవచ్చినహరిఁగని।
వితతోత్సవకౌతుకములవెలసిరిపౌరుల్॥ ౬౪॥

## ౭. శ్రీకృష్ణుఁడు శమంతకమును, జాంబవతిని గ్రహించుట.

వ॥ ఇట్లు హరి తనపరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి రాజసభకు సత్రాజిత్తుంబిలిపించి యావృత్తాంతమంతయు నెఱింగించి సత్రాజిత్తునకు మణినిచ్చిన నతండు సిగ్గుపడి మణింబుచ్చికొని పశ్చాత్తాపంబునొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికింజేని॥ ౬౫॥

కం॥ పాపాత్ములపాపంబులు।
వాపంగానోపునట్టిపద్మాక్షునిపైఁ।
బాపముగలదనినుడివిన।
పాపాత్మునిపాపమునకుఁబారముగలదే॥ ౬౬॥

మ॥ మితభాషిత్వముమానియేలహరిపై మిథ్యాభియోగంబుచే।
సితిఁబాపాత్ముఁడనర్థలోభుఁడనుదుశ్చిత్తుండను త్తుండను।
ర్మతినీదేహముఁగాల్పనేదురితమేమార్గంబునంబాయునే।
గతిఁగంసారిప్రసన్నుఁడై మనుచునన్గారుణ్యభావంబునన్॥ ౬౭॥

గీ॥ మణియుఁగూఁతునిచ్చిమాధవుపదములఁ।
బట్టుకొంటినేని బ్రదుకుకలదు।
సంతసించునతఁడుసదుపాయమగునిది।
సత్యమితరవృత్తిజేకుఱఁబడదు॥ ౬౮॥

మ॥ అనియిబ్భంగిబహుప్రకారములనేకాంతస్థుఁడై యింటిలోఁ।
దనబుద్ధింబరికించినీతిగనిసత్రాజిత్తుసంప్రాప్తశో।
భనుఁడై యిచ్చెవిపత్పయోధితరికిన్భామామనోహారికిన్।
దనుజాధీశవిదారికిన్ శౌరికిఁగాంతారత్నమున్ రత్నమున్॥ ౬౯

## ౮. సత్యభామా వివాహము.

ఉ॥ తామరసాక్షుఁడచ్యుతుఁడుదారయశోన్నిధి పెండ్లి యాడెనా।
నామనుజేంద్రనందితగుణస్థితిలక్షణసత్యభామను।
ద్దామపతివ్రతాత్వనయధర్మవిచక్షణతాదయాయశః
కామనుసత్యభామనుముఖద్యుతినిర్జితసోమనయ్యెడన్॥ ౭౦॥

కం॥ మణియిచ్చినాఁడువాసర।
మణినీకనుమాకుఁగలవుమణులుకుమారీ।
మణిచాలునంచుఁగృష్ణుఁడు,
మణిసత్రాజిత్తునకునుమరలఁగనిచ్చెన్॥ ౭౧॥

వ॥ అంతనక్కడఁ గుంతీసహితులైన పాండవులు లాక్షాగారంబున దగ్ధులైరని విని నిఖిలార్థదర్శనుండయ్యుం గృష్ణుండు బలభద్ర సహితంబుగాఁదేరెక్కి కరినగరంబునకేగి యచ్చటఁ గృపవిదుర గాంధారీ భీష్మద్రోణ ధృతరాష్ట్రులంగని దుఃఖోపశమనంబు సేయుచుండ ద్వారకాపురంబున సత్రాజిత్తుండు కృష్ణునకు సత్యభామనిచ్చెనని వానియెడఁబగగొని॥ ౭౨॥

సీ॥ అక్రూరకృతవర్మలాశతధన్వతో
మనకుసత్రాజిత్తుమణినిఁగూఁతు।
నిచ్చెదననిబొంకియెలమితో సత్యను
హరికిచ్చెనాఖలునడరిచంపు।
శౌరినీతోడనువైరంబుగొన్ననీ
కత్తఱిసాహాయ్యమరుగుదెంతు।
మనితన్నుఁబ్రేరేపనర్ధరాత్రినిదుర
నొందుసత్రాజిత్తునుగ్రవృత్తిఁ।

గటికివాఁడుపశువుఖండించువిధమునఁ।
జెంపిమణినిఁగొంచుఁజేనియెవాని।
యువిదలెల్ల నేడ్వ నెక్కనాఁడాశత।
ధన్వుఁడధికలోభిధర్మ మెడలి॥ ౭౩॥

వ॥ ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామయతనిం దైల ద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుంజని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తుమరణంబు విన్నవించిన నంతరంబున సంతసించి యీశ్వరులయ్యు రామకృష్ణులు మనుష్యభావంబుల విలపించిరి. అంతసత్యహరికిట్లనియె. నేనెవ్వరిదాన, నీనిందయెవ్వరిది యెట్లోర్తు నీకుఁబోలినట్టు చేయుమని వందురఁగృష్ణుండు రోషారుణితాత్ముండై సత్యకిట్లనియె. ఈపరిభవంబునాయది, నాయెదుట నిప్పుడు మిగులవగచినఁ బ్రయోజనంబేమి. ఆశతధన్వుఁ డెక్కడఁజొచ్చినఁ బొరిగొందు. నీవూఱడుము. పులుఁగులు తమగూండ్లు పెట్టిన చెట్టుదాఁటిన బంధింపఁబడవెట్లు. అట్లనీతండ్రి కృపణుండై మృతినొందెనని పల్కి ధృతరాష్ట్రాదులవీడ్కొని బలరాముండుదోడరా సత్యాసహితుండై రథారూఢుండై ద్వారకఁజేరి యన్నకేకాంతంబుననిట్లనె. ప్రసేనుఁడు వేఁటకేగి యటవిలోఁ జచ్చె. సత్రాజిత్తుండు శతధన్వచేనీల్గె. ఆశమంతకరత్నంబు. మనయిద్దఱకు సామాన్యంబు. కావున నిప్పుడు శతధన్వుఁజంపఁబోదము. రమ్మననిశ్చయించె. అంతనదివిని శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్మనింటికిం జని తనకు సహాయంబుగమ్మని ననతండిట్లనియె॥ ౭౪॥

ఉ॥ అక్కటరామకృష్ణులుమహాత్ములువారలకెగ్గు సెయఁగా।
నిక్కడనెవ్వఁడోపువిను మేర్పడఁగంసుఁడుబంధుయుక్తుఁడై।

చిక్కఁడెమున్న మాగధుఁడు సేనలతోఁబదియేడుతో యముల్।
దిక్కులఁబాఱఁడేమనకుదృష్టము వారలలావువింతయే॥ ౭౫॥

వ॥ అని యుత్తరంబుచెప్పిన విని శతధన్వుఁ డక్రూరునియింటికిం జేని హరితోడి పగకుందోడురమ్మని చీరిన నక్రూరుండు హరిబల పరాక్రమ శౌర్యంబులుగ్గడించి మఱియు నిట్లనియె॥ ౭౬॥

సీ॥ ఎవ్వాఁడువిశ్వంబు నెల్ల సలీలుఁడై
పుట్టించురక్షించుఁబొలియఁజేయు।
నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు
లెవ్వనిమాయ మోహించుజగము।
లేడేండ్లపాపఁడై యేవిభుఁడొక చేత
గోరక్షణమునకై కొండయెత్తె।
నెవ్వాఁడుకూటస్థుఁడీశ్వరుఁ డద్భుత
కర్ముఁడనంతుఁడుకర్మసాక్షి।
యట్టిఘనునకుశౌరికినవరతము।
మ్రొక్కెదముగాకవిద్వేషమునకు నేము।
వెఱతుమెల్లము నీపొందు వేగఁబొమ్ము।
చాలుఁబదివేలువచ్చెనీసఖ్యమునను॥ ౭౭॥

వ॥ మఱియొకయుపాయంబు చూచికొమ్ము పొమ్ముపొమ్మని యిట్లక్రూరుండుత్తరంబీయ శతధన్వుఁడిట్లనె. నన్నురక్షింపకున్న నేమి. నీవక్రూరుండవకావె. నీవును గృతవర్మయుం బ్రేరేపన కాదె సత్రాజిత్తుం జంపితి. ఈరత్నంబు నీకడ నుంపుమన్న నేనెక్కడ రత్నంబుదాచు టెక్కడనైన నీయవసానంబున నైన నేరికిని జెప్పకుండెదవేని నాసన్నిధినుంచెదననిన సమ్మతించి శతధన్వుఁడామణి నక్రూరునొద్దనునిచి శతయోజన వాహ్యమానయగు బడబనెక్కి నాఱడాముకచేనియె నంత గరుడ

కేతనాలంకృతమైన తేరెక్కి రామకృష్ణులు వెనుచేనిరంత
నయ్యశ్వంబు శతయోజనంబునడిచియుఁ గ్రమ్మఱఁగొంత
దవ్వతనిమోచి మిథిలాపురవనోద్దేశంబునఁ బ్రాణంబులు
విడిచె॥ ౭౮॥

చం॥ తురగమువీడితల్లడముతో శతధన్వుఁడు పాదచారియై।
పరువిడఁబోకుపోకుమనిపద్మదళాక్షుఁడుగూడఁబాఱిభీ।
కరగతివానిమస్తకముఖండితమైపడ వ్రేసెఁజక్రముం।
బరిహృతదైత్యచక్రముఁ బ్రభాచయమోదితదేవశక్రమున్॥ ౭౯॥

వ॥ ఇట్లు హరిశతధన్వుని వధియించి వానివస్త్రంబులందు మణి
వెదకి లేకుండుటదెలిసి బలభద్రునికడకువచ్చి శతధన్వుండూర
కయే హతుండయ్యె, మణి లేదనిన బలభద్రుండు రౌద్రోద్రేకం
బున॥ ౮౦॥

మ॥ ధనతృష్ణుండవునీవిదేటికిభవద్గాత్రంబునాభ్రాతవం।
చును స్నేహంబునతాలిఁబొందితిమహాచోద్యంబుగానీడఁజే।
నీనయింబాసలకేనునమ్మదునెపోస్వేచ్ఛాగతిన్నీవుప।
ట్టణమేలాయిఁకనీవునేలయలచేట్టాలేలనాకియ్యెడన్॥ ౮౧॥

వ॥ అని యాక్షేపించుచు వేడినఁ బ్రసన్నుండుగాక మిథిలాపు
రంబునకేగినజనకుండెదుర్కొని సంతసించి యర్ఘ్యపాద్యాది
విధులనర్చించి తనగృహంబునకుఁ దోకొనిపోయి మహానుభావా
నీయిచ్చవచ్చినపదార్థంబులు గొంచునుండుమని భక్తిఁజేసిన
నచేట మూఁడువత్సరంబులుండె. అంత దుర్యోధనుండచటికే
తెంచి జనకరాజుచే సమ్మానితుండై॥ ౮౨॥

కం॥ చేలమునగాంధారేయుఁడు।
లలితగదాయుద్ధకౌశలమునేర్చెఁదగన్।

హలిచే శ్రితజననిర్జర।
ఫలిచేఁ ద్రైలోక్యవీరభటగణబలిచేన్॥ ౮౩॥

వ॥ అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుఁ జేని శతధన్వుని మరణంబును మణిలేకుంటయును సత్యభామకుఁ జెప్పి సత్యాప్రియకరుండుగావున సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు చేయించి సుఖంబుండఁ గొన్నాళ్లకు॥ ౮౪॥

గీ॥ ఉగ్రసేనాదియాదవులుజ్జ్వలమణి।
హరియపహరింపలేదుసత్యమనినిశ్చ।
యించిమిథిలకేగిహలికిదెల్లఁదెలిపి।
వేడితోడితెచ్చిరిసీరివేడ్కతోడ॥ ౮౫॥

వ॥ అక్రూరుండు నయ్యుత్తమమణి సముద్భూత సువర్ణంబుగల వాఁడగుటయే కాక హరి సమయించునను భయంబున నిట్లని యెంచె. యజ్ఞదీక్షితులైన క్షత్రియ వైశ్యులఁ జంపిన బ్రహ్మహత్యాదోషంబని స్మృతు లుద్ఘోషించుచున్నవని నిశ్చయించి నిరంతరక్రతుదీక్షకవచప్రవిష్టుండైయుండె. ఇట్లు తన్మణిప్రభావంబున ద్వారకలో నఱువదిరెండేండ్లు దుర్భిక్షమారికాద్యుపప్లవంబు లేమియు లేకుండె. ఇట్లుండ నక్రూరపక్షీయులు॥ ౮౬॥

కం॥ భోజులుసాత్వతపౌత్రుని।
నాజినిశత్రుఘ్నుఁజంపనక్రూరుండా।
భోజులతోఁజనెద్వారకఁ।
దాఁజెయ్యనవిడిచియంతద్వారకలోనన్॥ ౮౭॥

గీ॥ మరణదుర్భిక్షజలవహ్నిమారికాద్యు।
పద్రవములుజనింపఁగఁబద్మనాభుఁ।
డఖిలయాదవవృద్ధులనపుడుపిలిచి।
యిట్లువచియించెవారితోనేర్పడంగ॥ ౮౮॥

## ౯. కృష్ణుండు యాదవులతో యోచించుట.

గీ॥ ఈప్రదేశమువ్వొత్తుగనేలసకల।
పీడలకునాకరంబయ్యెఁజూడుఁడనిన।
నంధకుండనుయదువృద్ధుఁడరసియరసి।
శౌరితోనిట్టులనియెనుదారభంగి॥ ౮౯॥

సీ॥ కాశీశునంగనగర్భంబునందొక్క
కన్యకయుండెనుగ్రమతమాస।
పూర్తియైనఁబయికిబోడసూపకనుదల్లిఁ
బండ్రెండువర్షముల్బాధపఱుప।
జనకుఁడిట్లనెఁజూచితనయయేలనెతల్లి
బాధింతురాఁగదేచాలయనిన।
గర్భస్థయిట్లనెఁగాశీశుతోనప్డు
దినదినమొక్కొక్కధేనువీవు।
విప్రునకుమూఁడువర్షముల్వీడువకిడినఁ।
బిదపనుదయింతునన్ననావిభుఁడునేనె।
నట్లుకూఁతురుజనియించెనంతనృపుఁడు।
పెట్టెగాందినియనుపేరుపట్టికలరి॥ ౯౦॥

గీ॥ అట్టియీగాందినినొసంగెనాశ్వఫల్కు।
నకునుభక్తినాదంపతులకుజనించి।
నట్టియక్రూరుఁడక్రూరుఁడతితపస్వి।
యాతఁడుండనిచోఁబీడలబ్బురంబె॥ ౯౧॥

కం॥ అతిగుణవంతునితప్పులు।
వెతకుటయేటికిసరగునఁబిలిపింపుముసా।
త్వతులక్రూరునికభయం।
బతిసమ్మతినిచ్చినారలబ్జదళాక్షా॥ ౯౨॥

కం॥ ఆతఁడువచ్చిననిటను।
త్పాతంబులుఁదాపములునుపద్రవములునీ।
భూతలజనులకునుండవు।
భూతియొసఁగువానగురియుఁబుణ్యాచరిత్రా॥ ౯౩॥

వ॥ అనినవిని వనజోదరుండు తగుదూతలంబంపి యక్రూరునిరావించె. అతండువచ్చినమాత్రన సకలోపద్రవంబులు శాంతిల్లె. అంతఁ గృష్ణుండాత్మగతంబున నిట్లనివితర్కించె. అక్రూరుండు గాందినీశ్వఫల్కులకుదయించె. శ్వఫల్కునంతవాఁడెయగును. అయిన మార్యాద్యుపద్రవంబు లొక్కమాటె యుపశమింప నితని ప్రభావంబుచాలదు. ఇతనియొద్ద శ్యమంతకమహారత్న మ్మున్నయది, యమ్మణి యిట్టి ప్రభావంబుగలయదియనివింటిమి. మఱియు నితండు తదుత్తమరత్నప్రతిదినజనితసువర్ణంబునఁ బూర్ణకాముండై క్రతువులొనర్చుచుండెననియుఁ దెలిసెనని నిశ్చయించి॥ ౯౪॥

సీ॥ ఒకకార్యమిషచేతసకలయాదవులను
రావించివారితోఠీవితోడఁ।
గొన్నిముచ్చటలాడివెన్నుఁడక్రూరుతో
డఁబ్రసంగవశతఁగడంకతోడ।
సరసంబులాడియోశ్వాఫల్కియఖిలజ
గత్సారభూతమైకాంతినొప్పు
నాశమంతకరత్నమాశతధన్వుఁడే
గునపుడునీకిచ్చెననియెఱిఁగితి।
సకలరాష్ట్రోపకారినీసముఖమందు।
నున్నదుండుఁగాపుతనేముతన్నితాంత।
సుప్రభావఫలముభుజించుదుము గాని।
యేలమాకదితాల్పములీలకైన॥ ౯౫॥

సీ॥ అనిమఱియిట్లనె నక్రూరనాయన్న
నమ్మఁడయ్యెను నన్ను నెమ్మెగాదు।
అఖిలబంధులలోన నామణిచూపునా
నతఁడాత్మ నెట్లొకో యనుచునుండి।
లేదన్న నిప్పుడే యాదవులా యంబ
రతిరోహితంబైన రత్నమారయఁ।
గలరిదియంతకుఁ గడుఁ బెద్దవై రమా
ననిమొంచి హరితోడ ననియెనిట్లు।
దేవశతధన్వుఁ డీమణిఁ దెచ్చియిచ్చె।
నతఁడు వోయిన దాదిగా నపుడో యిపుడో।
యెల్లియో కొందువంచేను నిది గ్రహించి।
యింతదాఁక ననధికమైన కృఛ్రమునను॥ ౯౬॥

గీ॥ తాల్చియుంటిఁ దత్క్లేశతఁ దనువుడస్సె।
భోగములు వోయె సుఖములు పొందవయ్యె।
నీవె ధరియించి రాష్ట్రంబుఁ బ్రోవఁదగుదు।
గైకొనుమభిమతులకిమ్ము నాకువలదు॥ ౯౭॥

## ౧౦. అక్రూరుండు శమంతకరత్నంబు నిచ్చుట.

వ॥ అనుచు స్వోదరవస్త్రగోపితలఘుకనక సముద్గకంబు విప్పియం
మనిరంతర కాంతిపుంజ ప్రకాశితదిగంతంబగు శమంతకంబు
యదుసమాజంబు నెదుటం బెట్టె. అంతనాయాస్థాన మెల్లను
ద్యోతితమయ్యె. అంతనక్రూరుండిట్లనియె. శతధన్వుండీమణినాకి
చ్చె. ఇదియిందెవ్వరిదో వారు గొనుండు, నా సర్వయాదవులు
నక్రూరుని నిర్వక్రత్వంబునకు లఱియతనిం బేర్కొనిరి. బలరా

ముండుల్లంబునఁ దనకుఁగృష్ణునకు సామాన్యమ్మనియెంచె. పితృధనంబగుటఁ దనదనిసత్యదలంచె. వారియుభయుల యాననంబులుసూచి హరిచిత్తంబున బలరామునకీకున్న నతండునుసత్యకునీయకున్న సత్యయునలుగుదురు. నాకుగోచక్రాంతరిత జంతువు విధంబుననయ్యెనని తలపోసియక్రూరుం జూచియిట్లనియె. ఈరత్నంబాత్మసంశోధనార్థంబుగా యదువుల యెదుట దర్శింపంబడె. ఇదినాకుబలరామునకు సామాన్యంబు. పితృధనంబగుట సత్యభామకుగాని యొల్లకురాదుగదా, దీనిసర్వకాలంబు శుచియైబ్రహ్మచర్యంబు జేరపువాఁడు దాల్పవలయు. అట్లేని రాష్ట్రంబు సుఖంబున నభివృద్ధింబొందు. అశుచిధరించెనేని యారాష్ట్రంబుతో నవానిని రూపుమాపు నంటకులేశంబయిన సంశయంబుగలదె. నాయన్నముంగోపి, యనవరతమదిరాపానపరవశుండు. సత్యయుఁజపలచిత్త. నేనుషోడశసహస్రస్త్రీభోగిని. కానబలుండును సత్యయునేనును నిన్నెవేడికొందుము. నీవుదాల్చిన రాష్ట్రోపకారకంబు. కావుననెప్పటియట్ల రాష్ట్రోపకారకంబుగనీవె తాల్పుము. అన్యంబువలుకకు. అనిన నక్రూరుండు మరలనాశమంతకరత్నంబు గైకొని నాటంగోలెఁబ్రకాశంబుగ నెకంఠంబునం దాల్చి రెండవ పుండరీకషండసఖుండన రోచిర్మండలంబ ఖండంబై దిశలనిండ విహరింపుచుండె॥ ౯౮॥

కం॥ ఘనుఁడుభగవంతుఁడిశ్వరుఁ।
డనఘుఁడుమణిదెచ్చియిచ్చినట్టికథనమున్।
వినినఁబఠించినఁదలఁచిన।
జనులకుదుర్యశముఁబాపసంఘముఁదొలఁగున్॥ ౯౯॥

మ॥ భగవంతుండుపరుండు శ్రీశుఁడుపరబ్రహ్మంబు దేవుండుప।
న్నగతల్పుండనువాసుదేవుఁడను శ్రీనారాయణుండొక్కఁడే।
జగదాధారుఁడుదీనరక్షకుఁడువిశ్వవ్యాపివిష్ణుండు స।
త్వగుణా
ఢ్యుండనుబార్ణకాముఁడతఁడే ప్రాప్యంబు సర్వేశుఁడున్॥

కం॥ పగనయిననవ్వగనైనను।
భగవంతుం జెలిమి నేనివారకతలఁపన్।
మిగులసుఖంబులిహపరము।
లఁగల్గజేయునుహరిమునులారావినుఁడీ॥

వ॥ మునిశ్రేష్ఠులారా ప్రతిసంవత్సరంబు భాద్రపదశుద్ధచతుర్థియం
దుబ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాంచి కాల్యకరణీయంబులు
దీర్చికొనిసుస్నాతుండైయమూల్యవస్త్రాభరణ ధారియైసువ
ర్ణరజతమృణ్మయంబు లందేదేనియొక్క వినాయకమూర్తిందె
చ్చి సభక్తికంబుగ దూర్వాంకురచంపక మల్లికాదిసురభి కుసు
మంబులం బూజించిపంచభక్ష్య పరమాన్నపాయసాపూపమో
దకనాళికేరఫలంబులని వేదించిషోడశోపచారంబులు సలిపితాం
బూలనీరాజనంబు లర్పించియుత్తరాభి ముఖుండైయేని పూ
ర్వాభిముఖుండై యేనికూర్చుండి సంయతుండై పుస్తకం బుఁబౌ
రాణికుం బూజించిధాత్రేయికా వాక్యంబు పఠియించిగజాసు
రవధతోనున్న స్యమంతకోపాఖ్యానంబు సావధానంబుగా వి
నవలయు. పిమ్మటభూసుర బంధుమిత్రపుత్రాది యుక్తుండై
భుజించివారికిఁ దాంబూలగంధాం బరాదులిచ్చునది. ఇక్కథ
వినుటచేఁజంద్రుఁ జూచినదోషంబు వోవుటయేకాక సకలాప
వాదంబులఁ దొలఁగియిహంబు నబహుసంపత్సౌఖ్యంబులంబొం
దియనంతరంబు నిత్యంబైనమోక్షంబు నొందుననిశ్రీకృష్ణుండు
కరుణించి సహృదయంబుగఁ జెప్పెననిసూతుండు మునులకుఁ

జెప్పె. శ్రద్ధగ నీయుపాఖ్యానంబు వ్రాసినఁ,జదివిన,వినిన,వినిపించినని హపరసుఖంబులను భవించెదరన్న శౌనకాది మునీశ్వరులునిఖిల పురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుండైన సూతుంగని మిక్కిలి కొనియాడిహరికథల వలనఁదనివితీఱదు, ఇంకం జెప్పుమనుటయు॥ ౧౦౨॥

చం॥ మణితపనీయకీలితసమంచదనర్ఘ్యపరిష్కృతానుష।
ద్గుణనిధి శ్రీరమాదయితకోమలదీవ్యదనన్యదేహచా।
రణగణసన్నుతాహరినిరంతరవిశ్వసుభాతిదాయకా।
తృణవదుపేక్ష్యపాప్యవనదీక్షితరక్షకపక్షివాహనా ॥౧౦౩॥

మాలిని॥ ప్రకటితబహుకీర్తిభవ్యధర్మానువర్తీ।
సకలకుశలధాతా సర్వలోకప్రదాతా।
వికచవనజదామావీరలోకాతిభీమా।
శుకవిరచితసమ్యక్ స్తోత్రగీతాదివేద్యా॥ ౧౦౪॥

సీ॥ గోదావరీతీరకోటిలింగాఖ్యపు
ణ్యక్షేత్రయుక్తవిఖ్యాతిఁదనరి।
రాజరాజనరేంద్రురాజధానియయిన
రాజమహేంద్రవరంబునకును।
నైరృతిదిశయందునాలుగామడదూర
మునగోస్తనీతరంగిణికిఁగోను।
దూరమందునఁబోలమూరునా గ్రామమొ
క్కటిసకలజనయుక్తమయియఖిల।
సస్యసరసీవనములనెసంగిపొఁడి।
గలిగిపాడికలిమినేలఁబడుచునుండు।
బహుళదూరసమాగతపశ్చిమాంతరీప।
వాసిహూణేంగ్లీషునృపులవలన॥ ౧౦౫॥

సీ॥ అందుండునాశ్వలాయనసూత్రుఁడనఘభా
రద్వాజగోత్రుఁడార్యజనమిత్రుఁ।
డబ్జనేత్రవరదయాపాత్రుఁడిద్ధచ
రిత్రుండుగురుసమాశ్రితపవిత్రుఁ।
డురుమంగువంశాబ్ధికుత్పలమిత్రుండు
భవనాశిరత్నాంబలవరపుత్రుఁ।
డలశ్రీనివాసరాయాఖ్యపౌత్రుండుచిం
తలపూడినరసుపంతులకుఁగౌశి।
కప్రవరునకుదౌహిత్రుఁడీప్రబంధ।
మచ్యుతార్పణముగఁదగహరికిఁగృతిగఁ।
జేసెవేంకటలక్ష్మీనృసింహరావు।
కరుణఁగైకొనుఁగావుతఘనుఁడుశౌరి॥ ౧౦౬॥

చ॥ కలియుగమందు (౪౯౮౪)నభ్ధిగజకంజజవారిధిసంఖ్యకుందగం।
దులయగుచిత్రభానువునఁదోయరుహాప్తుఁడుయుగ్మరాశిలో।
మెలఁగఁబదాఱునాఁడులకుమేదినిపైఁబ్రకటించితేనును।
జ్జ్వలమగునీప్రబంధముయథామతిఁజేసితిభక్తిభావనన్॥ ౧౦౭॥

కం॥ నీరము క్షీరముఁగలిసిన।
క్షీరమెకొనునంచలట్లు చిఱుగబ్బములో।
సారమసారముఁగలిసిన।
సారమెకైకొంద్రుగాకసజ్జనులెలమిన్॥ ౧౦౮॥

శ్రీ[illegible]తకోపాఖ్యానము.

సర[illegible]బునుత్తరభాగము.

సంపూర్ణము.

---

# ప్రకటన.

## విక్రయమునకు సిద్ధముగనుండు పుస్తకములు.

---

| | | | అ. పై. |
|---|---|---|---|
| 1. | సుఖదీపిక I భాగము III తరగతికి | ... | 1—6 |
| 2. | సుఖదీపిక II భాగము IV తరగతికి | ... | 2—0 |
| 3. | శశికళాపరిణయము శుద్ధాంధ్రవచనకావ్యము | | 2—0 |
| 4. | దసరాపద్యములు ... | ... | 0—6 |
| 5. | శ్రీకేశవశతకము ... | ... | 0—6 |
| 6. | శ్రీకృష్ణవిలాసము (కట్టుపద్యములు) | ... | 0—3 |
| 7. | శ్రీసూర్యభగవచ్ఛతకము ... | ... | 0—6 |
| 8. | శ్రీశ్యమంతకోపాఖ్యానము ఇందు వినాయకుని పట్టాభిషేకము మొదలగు కథలుండును పద్యకావ్యము | | 3—0 |

ఈగ్రంథములు ఈక్రింద చేవ్రాలుచేసిన గ్రంథకర్తయొద్ద దొరకును. ఒకేవిధమగు పుస్తకములు కొనువారికి 10 - కి 1 చొప్పున ఎక్కువగ నీయబడును. V. P. గా పంపబడును.

మంగు - వేంకటలక్ష్మీనృసింహారావు.

బ్రాంచిపోస్టుమాస్టర్

అండ్ తృతీయసహాయోపాధ్యాయుడు

బోర్డువర్నాక్యులర్‌లోవర్

పాలమూరు, గోదా